# మతిమాలినమరణశాసనము

(ఆంగ్లమునకనువాదము)

పరిశోధకనవలలు – మూడవభాగము.

శ్రీ గుర్రాల నారాయణరావు.



మొదటికూర్పు: 1000

శ్రీ కృష్ణా బుక్కుడిపో,
రాజమండ్రి.

శ్రీసీతారామాంజనేయ ముద్రాక్షరశాల,
రాజమండ్రి.
1932

వెల 1-0-0

ఇది

సుహృదయులును

స్వార్థత్యాగులును

అగు

దే శ భ క్తు ల కు

సమర్పణము.

నారాయణరావు.

# మతిపోలిన మరణశాసనము.

## మూ డ వ భా గ ము.

[ ఇరువది మూడవ ప్రకరణము తరువాయి ]

నావ కట్టినతా డంతవరకు వదులుగా నుండి దీపపువెలు తురలో క్రిందకు మీదకు నూగు లాడుచున్నది. అప్పు డొక సెకనులో బిగిసి పోయినది. కొయ్యచివర నున్న దీపము, త్రాగిపట్టువీడిన దానిలాగున నిటు నటు యూగు లాడసాగినది. మునిగి పోవుచున్నది. సంగతి గ్రహించి రామసింగు దానిని వెంటనే విడిచి వేసినాడు.

ఆ పెద్దమోటారులాంచి మీద దీప మొకటి యాకస్మికముగా మెరసి దానియునికిని వెల్లడిపరచినది. బర్వే కంఠధ్వని నీటిమీద గంభీరముగా వినుపించినది.

"రామసింగు! లొంగిపో. తిరిగి యొకమాసములో విడిచి పుత్తును. ఎవరికికూడ నేవిధమైన ప్రమాదమును రా నీయనని చెప్పుచున్నాను. మీ రిపుడు మునిగిపోవుచున్నారని మాకు రూఢిగా తెలియును" అన్నాడు.

రామసింగు సమాధానము చెప్పకుండ పిస్తో లందుకున్నాడు. ఆదీపపువెలుతురు పూర్తిగా వికసించి వ్యాపించి, న

లుపక్కల సంచరించి, అప్పటి కప్పుడే సగము పైగ నీటిలో మునిగి పోయిన డింగీమీద నిలచినది. అందలి మోసము బో ధపడుటచే కాబోలు పెద్దలాంచిమీదనుంచి క్రోధపూరితమై న పెద్దగర్జన యొకటి బయలు దేరినది. పిస్తోలు మీద కత్తి రామసింగు భోణీ చేసినాడు. ఆ పెద్దదీపము [Search Light] చుట్టును తిరిగి వచ్చి క్షణకాలము వారిచిన్నలాంచిని కన్నులు చెదరు వెలుతురలో నింపి వేసినది.

రామసింగు మరి యొకసారి పేల్చినాడు. అద్దము పగిలి పోయిన చప్పుడు స్పష్టముగా వినుపించినది. అంతవర కంత వె లుతురునిచ్చు వెలిబుచ్చు చున్న నా పెద్దలాంతరు [SearchLight] ముందు నుండు యద్దము [Lense] పిస్తోలుగుండు తగిలి పగిలి పోయినది. అది లోపలివత్తికికూడ తగిలి యుండును. దీపము కూడ నారిపోయినది. అక్కడనుండి పిస్తోళ్ళు దానికి సమాధా నము పలికినవి. కాని బర్ద్వేదగ్గర నంతదూరము పోవుసామర్థ్య ముస్న తుపాకులుగాని, పిస్తోళ్లుగాని ఉన్నటుల కనుపించదు. అతడు విడచిన గుండ్లు రామసింగు లాంచివారగా క్రిందను మీదను పడినవి. కాని వారి కేవిధమైన హానియు కలుగ జే యజాలినవి కావు.

అందుచే బర్ద్వే కప్పటికి కడుపు మండినది. మొండి కె త్తి పో సాగినాడు. అత డావ్యాపార మప్పుడే ముగింపు చే యవలయు నని స్థిరపరచుకొన్నాడు. మోటారులాంచిని గంభీ

రార్భాటము చేయుచు, రెండవలాంచిని మ్రింగివేయుటకో యనునట్లు దానిమీదకు వదిలి వేసినాడు. అంతకు పూర్వము నీటిమీద తేలి పరుగెత్తిన ప్రమాదకరమైన యొకతొరాజువ్వ దానిపని చేయ జాలక పోయినను, అంత గంభీరాకారము గల వారి మోటారులాంచి యయినను కావలసిన పని చేసి తగువు పరిసమాప్తి నొందించ గల దని ధైర్యము.

చీకటిలో లాంచి నడుపుట చాల తెలివితేటలయిన సంగతియే. విరోధి చాలవరకు మీదకు వచ్చియుండుటచేత రామసింగు చేయునది లేక తన లాంచి హఠాత్తుగా ప్రక్కకు త్రిప్పి దెబ్బ తప్పించుకున్నాడు. బర్వే లాంచి తిన్నగా ముందునకు దూసికొని పోయినది.

ఒక తాడు చివర కట్టిన చిన్న యినుపచక్రము గాలిలో గిరున తిరిగి రామసింగు లాంచిమీది కొయ్యకు తగులుకున్నది. ఆతాడు బిగియులోపల రామసింగు ముందునకు దుమికి యది తెగ గోసినాడు. ఈలోపున తుకారాము పిస్తోలు పుచ్చుకొని ముందునకు పోవుచున్న విరోధిలాంచి వెనుకచెక్కల లోనికి కొన్నిగుండ్లు పంప నారంభించినాడు. ఏదియొ పేలినది. అరిష్టసూచకమయిన కొన్ని తడపడ శబ్దముల తరువాత యింజ నాగిపోయినది.

తుకారాము బిగ్గరగా "గుండు తగిలినది. దేనికో తెలియదు కాని యది వారి జిత్తుల పెట్టెలోనికి దూరిన దనుకొందును" అని యరచినాడు.

రామసింగు వెనుకకు తిరిగి, విరోధి దూకు డాపుకొన లేక ముందుకు తోసికొని పోవుట చూచినాడు. నీరు మెరకకు పోయి బుస్రిన వెనుకకు తిరిగి పార్లిపోవుచు చేసిన మాదమైన మొస్రాచప్పుడు విన్నాడు. కంగారుపడి తుకారామువైపు తిరిగి "అది మెరక యెక్కినది. నీలాంటి సంగతి చూచుకొనుము." అని బిగ్గరగా సరచి చెప్పినాడు.

అప్పటి కప్పుడే శృతి మించినది! దీర్ఘమైన యొక యీడ్పుధ్వనితో కీరి లాంచికూడ మెరక యెక్కినది. తుకారా మెంతత్వరలో యింజను వెనుకకు వేసినను మాట దక్కినది కాదు. లాంచి దిగతోయుటకు వారు గెడలతోడను, యింజను సహాయమునను చేసిన ప్రయత్నము లన్నియు వృథ యయినవి. కొన్ని వందల గజముల దూరములో వారి ప్రతికక్షి వారికన్న నెక్కువ కాకపోయినను వారి కెంతమాత్రము తీసిపోని దురవస్థలో పడియున్నటుల కనుపించినది.

రామసింగు వారి లాంచి ముందును, వెనుకను నీటిలోతు పరిశీలనచేసి, తరువాత పడవ లోపలిచెక్కలు వంగుట చూచినాడు. వానికి కనుపించినంతవరకు లాంచి కేవిధమైన ప్రమాదమును తటస్థించలేదు. అది మెరకమీదకు పోయిన దగ్గర నీరు సాపుగా ప్రక్కలకు తగులుచున్నది. ఏరాతికిని తగలకుండగనే సాపుగా మెరకమీదకు పోయినది.

అతడు పరిశీలన పూర్తి గావించుకొని, "మనము పో టువేళ మెరక యెక్కుట చాల దురదృష్టము. అయినను దీని లోని సరు కంతయు తొలగించి, బరువు తగ్గించినచో రేపు సులువుగా పోగలము. వా కిరాతి మనల నేమియు చేయజా ల రని నాకు గట్టి నమ్మకమున్నను, మన మీరాత్రి వంతులు వేసికొని మాత్రము కా పుండవలయును." అన్నాడు.

వాని యూహ సరిగా నున్నది. అతడు తెల్లవారుసరికి గూడుమీదకు వచ్చినాడు. పొగ మంచు కొంతవరకు మంద ముగా బయలుదేరినదిగాని యప్పుడే బయలుదేరిన సూర్యకిర ణములముందు నిలువ జాలక యదృశ్య మయినది. దూరమున నున్న ప్రతికక్షుల మోటారులాంచి స్పష్టముగా కనుపించుచు న్నది. అది వీరి లాంచిలాగునకాక యెక్కువ తీవ్రముగా పో వుచుండుటచేత బాగుగ మెర కెక్కి పోయినది. అది పడియు న్న చోట నీటికన్న బురదయు, పొడిమట్టియు యెక్కువగా నున్నది. దానిచుట్టును పచారు చేయుచు పరిశీలన చేయుచు న్న మానవు డొకడు వా రి కి క ను పిం చి నా డు. అతడే డాక్టరు బర్వే!

అతడు వెనుకకు తిరిగి రామసింగును చూచి చేయి వి సరినాడు. తరువాత తెల్లని జేబురుమాలు తీసి మీద కెత్తి పట్టుకుని, గట్టువారనే నడచుచు, మధ్య నున్న చిన్న చిన్న నీటిపాయలు గెంతి దాటుచు వచ్చి, మధ్యనున్న యొక విశా

లమైన నీటికాలువ కవతల నాగి పోయినాము. అక్కడకు రా మసింగులాంచి కొంచెము దూరమున మాత్రమే యున్నది.

అత డక్కడనుండి చాల కులాసగా "రామసింగ్! న మస్కారములు. రాత్రి నీవు లాంతరు విడిచి పెట్టిన చ మత్కారమునకు నీకు చాల హృదయపూర్వకమైన యభినందన ము. నేను నిన్ను పట్టుకొంటి ననియే భావించినాను. మన మి రువురముకూడ కొంతవర కిక్కడనే యుండవలసి వచ్చులాగు న కనుపించు చున్నది. అప్పటివరకు మనకు రణమా, రాజీ యా?" అని యడిగినాడు.

అంతట రామసింగు "నీవు మామీందకు రా ... తవర కును మేము నిన్ను తలపెట్టము. ఏలాగయినను మీలాంచి యిక ప్రయాణమునకు పనికి రా దనుకొందును" అన్నాడు.

"ఛా! ఛా! అంతవరకు పాడు గాలేదే! ముందువైపున మాత్రి యొక చిన్నరంధ్రము పడినది. అది యిప్పుడే బాగు చేయుచున్నాము. మీ పిస్తోలుగుండ్లలో నొకటి కావించిన ప్రక్క చెక్కలోని చిన్నకన్నము కూడ యిప్పుడే మరమ్మత యిపోగలదు. వచ్చిన చిక్కేమన నది మధ్యచెక్కలలో పడినం దున మే మిదివరకంత సాపుగ పోలేము. అయినను మేము గా లిగొట్టము వినియోగమున పెట్టగలము గనుక నంతప్రమాద మేమియు నుండకూడదు. దాని కేమిగాని, మే మీపాత్రతము లలో మీకొరకు కనిపెట్టుకొని యుందు మని నీవేలాగున

గ్రహించ గలిగితివో అదియె మాకు చాల విపరీతముగానున్న
ది.'' అన్నాడు.

రాజసింగా ప్రశ్నకు సమాధానముగా "ఒక చేప
లాంచి దగ్గరనుండి మాంసుగతి మీకేమయిన తెలియవచ్చిన
దా?'' అని ప్రశ్నించినాడు.

"అవును. మీ యోగక్షేమము తెలిసికొనుటకై నిత్య
ము మిమ్ము కనిపెట్టుకొని యుండు సిపాయీలు హితులము గ
దా మేము. కాని మే మా చేపలలాంచి దగ్గరకు పోవుట నీవు
చూచితివా యేమి?'' అని బర్వే మరల నడిగినాడు.

"ఆహా. లేదు. మాకు స్వల్పముగా యింజనుతంటాలు
వచ్చినది. మా యింజ నాగియుండగా మీ యింజను చప్పుడు వి
నుపించినది. నీటిమీద శబ్దము చాల దూరము. ప్రయాణము
చేయు నని నీ వెరిగినదే కదా! అదికాక మాకొక చిన్న మెరపు
కనుపించినది. అది నీతాలూకు [Periscope] పెరిస్కోపు అని
నే ననుకున్నాను. నీ వది కొంచ్యమీది కెక్కించుట నేను
చూచినాను. పొరబడితినా?"

"అయ్యో! నీవంటివాడు ప్రతికక్షిగా నున్నందులకు నే
ను నిజముగా గర్వపడుచున్నాను. నీవు చెప్పిన దంతయు నిజ
మే. మాదగ్గర పెరిస్కోపు పొకటున్నమాట వాస్తవమే. అది
యిప్పుడు లోపల నున్నది. నీ వది యేలాగు గ్రహించ గ
లిగితివి? "

"నీవంటివాడు సర్వసాధారణముగా వినియోగపరచు పనిముట్టట్టిదియే. అట్టి పరిస్థితులలో నేను కూడ నట్టిదియో యుపయోగపరచియుండును అవసరమును బట్టి అని" రామసింగు సమాధానము చెప్పినాడు.

"నీవు నిజముగా నన్ను పొగడుచున్నావు. కానీ ... మన మెల్లప్పుడును ప్రతికక్షులమై పనిచేయుచుండ వలసిన చ్చు టొక్కటియె చాల విచారకరమైనసంగతి. మనమిరువుర మేకమైతిమా ప్రపంచ మంతయు నల్ల కల్లోలము చేసియుందు మూ!" అన్నాడు.

"అ దొక్కటీ సంభవము కానిది ధృవములు కలిసికొను టవంటిది. పాప మేమి చేయగలము. అహ్హా ... ...... నీ నీచప్రోత్సాహములకు నేను లొంగువాడను గాను" అని రామసింగు కర్రపడిగా సమాధానము చెప్పి "కాని దానికి బదులుగా నీకు పనికివచ్చు చిన్నసంగతి యొకటి చెప్పెదను. వీలులోని షరతులు నెరవేర్చుకొనకుండ నీవు మహాత్మాఫిగో జు నాటంకపరచుటలో కృతకృత్యుడవు కా గలిగినను లేక పోయినను నిన్నిందు నియోగించిన యాసత్పురుషుడు హార్త్రా జీమాత్రము కలితీలేని యూశాభాగమును ఆలింగనము చేసి కొన వలసియుండు నని నేను స్పష్టముగా చెప్పుచున్నాను. నీవిందు ప్రవేశించి అనవసరముగా ప్రశస్తమైన కాలము వృధ పుచ్చుకొనుచు న్నావని చెప్పుటకు నాకునిజముగా కష్టముగా నున్నది" అన్నాడు.

"నన్ను నియోగించిన సత్పురుషుడు నీ వింతకు పూర్వ మున్న పెద్దమనుష్య డని నే నంగీకరించను. నేను కాలము వృథ పుచ్చుచుండుట లే దనిమాత్రము నీకు కచ్చితముగా చెప్పగలను. మాయిప్పటికున్న సంబంధ మీస్వల్పవ్యాపారముతో ముగియు నని నాయభిప్రాయము కాని అ దట్లు కాదు. వానిదగ్గర అమూల్యమైన తమాషా దంతపుపెట్టె యొకటున్నది. దానిమీద నాకు సరదా పుట్టినది. అది యీసరికి యేదో యొకవిధముగా మావారిలోని యెవరో యొకనిచేతులలో పడియుండును. అతడు వానియిరకతరకెల పెదతండ్రికి వారసుడు కాకపోయినను నేను నాకు కావలసినది వానిదగ్గర నుండి త్వరలో నే సంగ్రహించగల నని నాగట్టినమ్మకము. కాని యిది మనలో మనమాట. చాల రహస్యము. నీ వను మానించినటుల హార్తాజీ అయితే మాట లే."

రామసింగు నవ్వినాడు. "ఆ పెద్దమనుష్య డతడే యయితే మాత్రము, సరె, అతడు జీవించియుండగనే వానిని చర్మము వలిచి వేయవచ్చును. నాయభ్యంతర మెంతమాత్రము లేదు" అని రామసింగు సమాధానము చెప్పి, "సరే మన మిక కచ్చితముగా మాటలాడుదము. నీవు మాకడ్డురాకుండ దూరముగా పొమ్ము. మేము నీకు చిక్కులు తెచ్చిపెట్ట ప్రయత్నించము. అటుకాక నీవేదయిన తుంటరిప్రయత్నము చేసితివా, చూపిస్తోళ్లు పైకి రా వ ... మ్పరు. నాకును, తు

కారాముసకును గుణియించిదని నీకు బాగుగా తెలియకపోతే
ను" అని స్పష్టపరచినాడు.

"సెహబాస్, మనసు తిరిగి సరియైన పదునంతవరకు
ను, చిన్నసంధి యున్నమాట! ఐననేమి! తథాస్తు" అని చాల
వినమ్రతగా తల వొగ్గి సలాము చేసి తుంటరిప్రవర్తనగలయా
సత్పురుషుడు చుట్టును పరికించి, మందహాసము చేయు
చు కదలక మెదలక నిక్కచ్చిగనే నిలబడియున్న రామసింగును
విడచి తిన్నగా వానిలాంచిదగ్గరకు పోయినాడు. పరిమితిమీ
రిన వానిసాహసకృత్యములతో పాటు నాడాక్టరు స్నేహపాత్రుడు
కూడను.

"అతడు సాజాగా ప్రవర్తించక పోవుట చాల విచార
కరమైన సంగతి! కాని అట్టివారిప్రవర్తన మంచిదైన వారికి
యుత్సాహమును ఇచ్చు. మనకు చేతినిండ పనియునుండదు"
అనుచు రామసింగు వానిని త్వరగా రమ్మని యాహ్వానించిన
కాంక్షలపరకముల పటముతో తీసి పుచ్చజాలక తిన్న
గా లాంచిలోని గదిలో ప్రవేశించ సలసివచ్చినది.

వారు ముగ్గురును కాసేపగయిబరాల దగ్గర ఎక్కువ
కాలము వృథ పుచ్చలేదు. సముద్రమున కప్పుడే పోటు త
గులుచున్నది. బర్వేలాంచి మరమ్మత్తై, బయలుదేరులోపల
ముందుగా కొంత దూరము పోవలయునన్నచో వారాయవ
కాశము తప్పక వినియోగపరచు కొనవలయును. ముగ్గురును
పూర్తిగా కష్టపడి లాంచిక్రింద వెనుకవైపున ఇసుక తోల

గిరివి పొడుగైన కాలువ మొదలు త్రవ్వినారు. తరువాత లాం చితాంబాను బరువుగనుండు ప...సు తినుబండారపు సామానులు వగయిరా క్రిందకు దింపి లాంచి తేలికపరచినారు. వారిక చేయవలసిన దేమి? నీరు హెచ్చుగా లేచువరకును కాళ్లు చాపుకొని కనిపెట్టుకొని కూర్చుండుట.

## ౨౪

ఈలోపున బర్వేయును వాని మనుష్యులు ముగ్గురును మోటారులాంచి మరమ్మతులో పూర్తిగా నైక్యమయి పోయినారు. మిగిలిన వారిలో యొకని చేయి మెడకు కట్టిన గుడ్డలో నుండుటయు, మరియొకని తలకు కట్టుండుటయు, మఱియొకడు యెంతమాత్రము పనిచేయు స్థితిలో లేక రక్తహీనమైన ముఖముతో గూడుమీద పచారు చేయుచుండుటయు చూచి రామసింగు పిస్తోలుదెబ్బ లెంతమాత్రమును వృథగా పోక చాలవరకు పనిచేసినవని సంతసించినాడు.

ఆపనివాళ్లలో నెయొక్కని దగ్గరనైనను యజమానుని దగ్గరనున్న ధైర్యసాహసములలో కొంతకొంతయయిన నున్నట్టుల కనుపించదు. వారెల్లప్పుడును మాడుముఖములు వేసికొని యీచిన్నలాంచివైపు బెదరుచు చూడసాగిరి. వా

రా మోటారుయంత్రమును మరమ్మతు చేసి పద్ధతిలో పెట్టుట కెక్కువకాలముపట్టలేదు. అది త్వరలోనే తడపడ శబ్దము చేయుచు ప్రయాణమునకు సిద్ధపడినది.

బల్వే మరమ్మతును గూర్చి పైకి చాల తేలికగా మాట లాడినాడు. అది ప్రతిపక్షులకు కనుపించకుండ పెద్దబరక మొకటి యడ్డుగా తెరకట్టినట్లు కట్టినాడు. దానిని బట్టి మర మ్మతు చాలసేపు పని చెప్పలాగున కనుపించినది. కావలసిన సాధనసామగ్రి యాదుబాటులో లేనందున కళాసులు గది యడుగునుండి కొన్ని చెక్కలు విడతీసి వెలుపలపెట్టి రంధ్రము నకు మాసికవేయవలసి వచ్చినది. వారది తొందరగా చేయ ప్రయత్నించుట సాధ్యముకాదని వారికి పూర్తిగా తెలి యును. పలనన యేమాత్రము దెబ్బతగిలినను చెక్కలు విడి రంధ్రము పెద్దదయి లాంచిని నీటియడుగునకు పంపివేయును.

నీరు చాల నెమ్మదిగా యుబికినది. వారక్కడనుండి త్వరలోనే కదలిపో వచ్చునని యువ్విళ్లూరుచు ఆసమయము కొరకెదురు చూడసాగినాడు. అది గురితించుటకై తుకారా ము నీటివారనున్న రాళ్లు యెంతవరకు మునిగినవో యని వా టివైపు రెప్పవాల్చక చూచుచున్నాడు.

"ఆహా. ఈదీవిలో యసలు మానవు లున్నారన్న సం గతే నాకు తెలియదు" అన్నాడు.

"ఆ! ఎవరో చేపలవారలయియుందురు. దీవి కావల వైపున కాపురముండి యుంధురు." అని రామసింగు మామూ

లుధ్గోరణిలో సమాధానము చెప్పినాడు.

"ఈ వైపున నొక డున్నాడు. అడుగో. మన వైపునకే వచ్చుచున్నాడు." అనుచు తుకారాం మగు వ్రేలు చాపి చూపించినాడు.

ఒకమానవు డారాళ్ళపైన దాటుచు వారివైపు వచ్చుచున్నాడు. వాని బట్టలు మురికితోపాటు చాల మాసికలతో నిండియున్నవి. వాని చేతిలో చిన్న బాగీ యున్నది. వారు ముగ్గురు వానివైపుచూచుట గురితించి, యతడును వారిని సమీపించుచు చేయి మీదకు విసరి పెడసరముగా సలాము చేసినాడు. వారగా నీటిలో నడచుచు, చేతిలోని బాగీ మీదకెత్తి పట్టి, దానాతటగ స్పష్టంత్రముగా నడువగలిగినాత తీవ్రమయిన యుచ్చారణతో సంభాషణ ప్రారంభించినాడు.

"అయ్యలారా! మీరు నాకొక చిన్న సహాయము చేసి పెట్టవలయును. ఈ చిన్న బాగీ టపాకు పోవలసియున్నది. కొలదిరోజులలో యిక్కడనుండి పోవుపడవ యేదియు లేదు. అది తొందరగా పోవలయును. నా కుమారున కందవలయును. మీరు దయయుంచి నాతరపున నిది టపా లో వేసిపెట్టవలయును. దీనికి టపాలఖర్చు యెనిమిదణాలు సరిపోవు ననుకొందును; ఏమంటారు?" అన్నాడు.

రామసింగు గారంగీ యాదుకొని "ఆ. సరిపోవచ్చును." అని యామాటను పొసగిన రెండునిమిషాలుకూడ పుచ్చుకొని "నాకు వీలు గలిగిన త్వరలో సహాయము చేయుటకు ప్రయత్నించెదను. కాని, మీ మనలీవైపు వస్తువులు చేరకపోయినయెడల దీనికని నేమి యగుయున్నను?" అన్నాడు.

అది యిట్లుండగా, మహారాజునకు ఆ గారుసు వచ్చుచున్న సోటువైపు తుపాకాలము తటపటాయించి నుంచి వాగిలాంచి కనసరమైన కొన్ని గుండగుండ్లములు లోతునీరు వచ్చుచున్నదని గ్రహించి తల యూడించి "మీరు త్వరలోనే కదలి పోగలరు. కాని మీరు నేలాగున పోవుదురా అని నాకనుమానము. అక్కడ దూరమున నాలాంచి నెమెకటి. అదికాక రాత్రి తుపాకులు పేలిన చప్పుడుకూడ వినుపించిన దని నాయనుమానము. అదేలాగున సంభవించినది?" అన్నాడు.

రామసింగు సందేహములోనికి దిగి, అసలుసంగతి వానికి చెప్పుట కిష్టములేక దాటవేట్టు నభిప్రాయముతో, "రాత్రి పూగ మంచు పట్టముగా నుండుటచే త్రోవ తెలియక మే మొకరి కొండరము చాలదగ్గరగా వచ్చినాము. గట్టుమీదనుండి యెవరయిన వచ్చి సహాయపడుదు రన్నయభిలాషతో పిస్తోళ్ళు పేల్చినాము. మే మున్నదానికన్న నెక్కువప్రమాదావస్థలో చిక్కుకొంటిమేమోయని జడిసినాము" అన్నాడు.

కలిసి చిన్నలంగరునకు కట్టిన తాడు పట్టుకొని లాగ నారంభించినారు. ఇంజనుచక్ర మొక్కసారి హఠాత్తుగా కదిలి పెద్దచప్పుడు చేసినది. పడవయంతయు దడదడ వణకినది. ముగ్గురును యూపిరి బిగపట్టి బ్రహ్మాండమైన ప్రయత్నము చేసి చాలవరకు నడుములు విరుగ గొట్టికొనినప్పుడు గాని పడవ కదలినది కాదు.

"ఊఁ. హాయిసా పట్టు" అని రామసింగు హెచ్చరికగా కేక వేసినాడు. పడవ మరికొంచెము కదలినది. "ఊఁ హాయిసా"

మూడవసారి మరియు హెచ్చరికగా పట్టినప్పుడుగాని యది పూర్తిగా కదలలేదు. తుకారా మింజ నాపుచేసినాడు. వారు పడవ నీటిమీద పూర్తిగా తేలియాడునటుల నిలువబెట్టి క్రిందనున్న చిన్నలంగరు పడవమీద కెత్తి అంతకు పూర్వము క్రిందకు దింపిన తినుబండారములు, లాంచిసామానులు వగయిరాలన్నియు నొకదాని తరువాత నొకటి క్రమముగా పడవమీద సరిదినారు.

రామసిం గొకటి రెండు సారులు బర్వేలాంచివైపు తిరిగి చూచినాడు. వారి మనుష్యులు లాంచిలాగుట, గొట్టుట గెడలతో త్రోయుట కనుపించినది. చివరకు రామసింగు చిన్నలాంచి త్రోవలో నికి వచ్చి అతడు చుక్కాని సరుదుకొనునప్పటికి, బర్వేలాంచికూడ నీటిమీద తేలి ప్రయాణముకు సిద్ధమయినది. వాని మనుష్యులు చురుకుగా పని ప్రారం

భించినారు. ఒకడు కొయ్య కొంతవరకు మొగపాకి చెదిరి పోయిన తాళ్లు సవరుచున్నాడు.

"వారు చేసిన మోసిక కొంచె మవకతవకగానుండి చిక్కులు పెట్టుచున్నటు లున్నది. వారు దానికి తారుకూడ పూయుచున్నా రనుకొందును. ప్రక్కను అనగా వారు కొంత వరకు మనల నంతగా బాధించుట కవకాశ ముండదని నా నమ్మకము." అని రామసింగు వ్యక్తపరచినాడు. ఇంజను తిరిగి పని ప్రారంభించు నప్పటికి లాంచి దక్షిణదిశగా తిరిగి, బర్వేకి కావలసినంత తావు ప్రసగినది.

చేతిలోని చుక్కాని ఫిరోజున కందించి రామసింగు దుర్భిణి చేతపుచ్చుకొని ప్రతికక్షిని కనిపెట్టి చూచుచు కూరు చున్నాడు. తరువాత నొకయరగంటలో వారు నాలుగయిదు మైళ్లు దూరము పోయినారు. అప్పటికి బర్వే మోటారులాంచి రేవు విడచి వారివెనుక నీటివారనే బయలుదేరినది. రామసిం గాసంగతి గురుతించక పోలేదు.

"వారి కిక తంటాలులో పడుట యిష్టముండదు. పిస్తోలు మంచిసామర్థ్యము గల స్నేహితుడు" అని రామసింగు పెద్దపెట్టున నవ్వుచు "అదిగో వారు గమనము వృద్ధి పరచుచు న్నారు హుం" అన్నాడు.

అతడు చివర యుచ్చరించిన "హుం" లో గూఢముగా నున్న భావ మతను వ్యక్తపరచలేను. ఇంకను దూరమున నున్న మోటారులాంచి తదేకధ్యానముతో కనిపెట్టి చూచు

చున్నాను. కాని నేను సేవకునితో నది నౌకకు రెండుమైళ్లు ప్రక్కనున్న తోటను [illegible] కనుపించుచునే కనుపించకుండ పోయినది.

నాయకుడు [illegible] యొకసారి 'హుం' అన్నాడు. అతడు "[illegible] నాకు, లేక నేను బాడకెల్లితి నని భ్రమ పడుచున్నారు [illegible]. అది మీ మాటల నభినందించుట కాదు" అన్నాడు.

తరువాతము చాల సేపటికి "అయ్యా! తమ యభిప్రాయ మేమి?" అని యడిగినాడు.

నాయకుడు [illegible] స్వరమును చాల హెచ్చరికగా "అవును. [illegible]. మీరు నా [illegible]. నే నొక య[illegible] వ్యక్తపరచుచున్నాను. అది పొరపాటయి యుండవచ్చును. నేను సర్వజ్ఞుడ నని చెప్పుకొనుట లేదు. అయినను యదార్థ సత్యతగాని యసత్యతగాని మున్ముందే [illegible] పరచుకొనగలము.

"మొదటిసంగతి. కాలము పరుగిడుచున్న దని జ్ఞాపకము చేయుచున్నాను. అనుకూలమైన గాలి తగిలినయెడల మనము "సాలసెట్టీ" అను కొనిన దానికన్న రెండుమూడు రోజులు ముందుగనే చేరగలము. ఆరెండు మూడురోజులు విశ్రాంతి తీసికొని యయినను ఏలులోని మూడవవరతు ననుసరించి తిరోజు మూడువారములు యడవిలో కాలక్షేపణ చేయుటకే విధమైన యిబ్బందియు నుండదు."

లేదు. ఒకపల్లెటూరి ముండవాడు దూరమున నెక్కడనో యుండు వానికునూరుంకు హాపురకములోని దానిలాగుననే యున్నది. దానిలో యనుమానమున కవకాశ మిచ్చున దేదియు నాకు కనుపించుట లేదు. అట్టి యనుమాయకపు ముండకొడు కంతకన్న నెక్కువ ప్రయత్న మేమి చేయుంచ గలడు, బంగీ కట్టుటకు?" అన్నాడు.

"ఆహా! అలాగా మరి? అయితే నేను కొంచెము త్రోవ చూపించెదను. బంగీ చుట్టును వంద దారము చుట్టపెట్టి, వేసినముడి చూడుము. పల్లెవాడుగాని, పడవవాడుగాని, యెక్కువ తెలివితేటలు చూపునది ముడులు వేయుటలోనే అందు వారిసామర్థ్య మద్వితీయము. వారి కదే పనిగనుక. ఈముడి బంగీ మాక కిచ్చిన పల్లెవాడు వేసినది మాత్రము కాదని నే నెంతయయిన పందెము వేసి చెప్పుదును. చూడుము. ఒక చివర సామాన్యమైన జారుముడి వేసి దారముచుట్టు త్రిప్పి రెండవకొస దానిలోనుంచి దూర్చి ముడి వేసి నారు. ఇది గట్టిగా యెటులాగినను జారిపోవును. ఇట్టి చచ్చుముడి పల్లె వాడయినవాడు గొంతుక తెగ గోసినను వేయడు. అని" పలుకుచు హెచ్చరికగా నవ్వను రాయుసిం గాదారము పట్టి లాగినాడు.

తుకారా మాశ్చర్యముగా "చిత్తము, మీరు చెప్పి నది నిజమే. పల్లెవాడుగాని, పడవవాడుగాని చివర ముడి వేయుట కెప్పుడును రెండుకొసలును ఉపయోగించును.

అతడు వానిముడికి సర్వసాధారణముగా లవంగము మొదలు వంటి మెలత వేయును'' అన్నాడు.

రామసింగు వెంటనే యందుకొని సంభాషణ కొనిచ్చుచు "అది మొదటి సంగతి. తరువాత దిది. దీనిమీఁది వ్రాత మొగవాని వ్రాతయనుట కేంతమాత్రమును సందేహము లేదుకాని తరుచుగా కలము స్పృశించు నలవాటులేని యామోటుచేపల వాని చేతులతో వ్రాసినవ్రాత మాత్రము కాదు. బాగుగ చదువుకొని యితరులను మోసగించుటకై పాడుగా వ్రాయ ప్రయత్నించి, కొంతవరకు మాత్రమే కృతకృత్యుఁడయిన యొకబుద్ధిమంతుని వ్రాత యిది. చూడు మీ మొదటి యక్షరము 'క' వైపు. ఇది పైభాగము బాగుగనే వ్రాసి యున్నది. కాని యాలేఖరి మాత్రము దానిపైన మరియొక సారి వ్రాసిన పూర్తిగ వికారముగ నుండునని యాలోచించినాడు." అని చెప్పినాడు.

"హా. అది నాయంతట నేను నూహించి యుండను. మీరు చెప్పినమాట నిజమే. కాని యది పట్టి యెవరిచేత నయినను వ్రాయించినా డేమో" అని ఫిరోజు నసికినాడు.

రామసింగు సంభాషణ విడువక "అయియుండ వచ్చు కాని ఇదిగో, ఇటు చూడు. ఈబంగీమీఁద పే రెవరు వ్రాసినను, యెంత చేతగానివాడు వ్రాసినను, వ్రాయుటలో తెలియక యేయితరమాట యయినను తప్పువ్రాయును గాని తరుచు వ్రాయు నలవాటుగలవాని యూరుపేరే తప్పు వ్రా

యునా? ఏమందురు? ప్రస్తుతపరిస్థితులలో మన కనుమాన పుట్టించుట కామాత్రము చాలదా!"

ఫిరోజు చాలగ నభినందించుచు "నేనామాత్రము మా లోచించియుండవలసినదే. అయ్యో! సంగతి చూచిన, బంగీ విప్పకుండనే లోపల నేమున్నదో మీరు చెప్పకొనగల రనుకొందును?" అన్నాడు.

రామసింగు స్వల్పముగా మందహాసము చేసి వానిఫలితార్థములును, వాని యూహాపోహలను యింకను చెప్ప సాగినాడు.

"అదికాక, మీరు కనిపెట్టి యుందురు. మొదట వాడు బాగీచెయొనగ మాటలాడినప్పుడు ఆమనుష్యుని సంభాషణ చాల కల్పితముగను, పెడసరముగను పట్టిపట్టి మాటలాడినటులను ఉన్నది. అది దేనినో స్వయముగ తయారుచేసినది గాని, లేక యితరులు నేర్పి చదివించినదిగాని, వప్పగించుచున్నాడనుకొంటిని. మనలను సమీపించు నప్పటి కతడదికూడ పలుకుకొనుచున్నటుల వానిపెదవు లల్లల్లాడుచున్నవి. అతడాకొంచెమును చిలుకపలుకులలాగున చెప్పివేసిన తరువాత వానిమిగతసంభాషణ సాఫుగా, స్వభావసిద్ధముగా బయలుదేరినది."

"ఇంతకును మీరు చెప్పనదేమి చిట్టచివరకు. వానిని మనదగ్గరకు డాక్టరుబర్ట్సే పంపినాడందురా?" అని ఫిరోజు ప్రశ్నించినాడు.

“ఆహా. కచ్చితముగా వానిలాంటి మెరక యెక్కినతరువాత మనలను తరిలో కలిసికొని బాధించుట కష్ట మని బర్వే యభిప్రాయపడి కొన్నిదినము లాక్షేపముచుట్టును తిరుగులాడుచుండి యుండును. అదియునుగాక నాచేపలవాడ్రెక్కడనుండు నదియు వానికి పూర్తియయిన వాకపుచే గడిచినయర్థరాత్రియొ లేక నేటి ప్రాతఃకాలముననో యతడా పల్లెవానిని కలిసికొని, వానికి తగిన లంచ మిచ్చి వాని కేదియొ యొకకథ చెప్పి యిక్కడకు పంపియుండును. లేనియెడల మోస మెరుగని యాపల్లెవాడిందుల కంగీకరించి యుండడు. ఏమయిన నేమి. అతడాబాగీ మనలంచిమీద కెక్కించినాడు. అంతటితో వానిపని యయినది. ఈబాగీ మన స్వాధీనమున నుండుటచే మనల నాపి నిర్బంధమున నుంచుటకు కావలసిన సాధనసామగ్రి యందులో సిద్ధముగా నున్న దన్న మాట. అంతవరకు పూచీ దారును నేను ”

ఫిరోజు చాల యాత్రముగా హెచ్చరిక చూపుచు “అయ్యో, అయితే యిప్పుడందులో నేమున్న దని మీయభిప్రాయము?” అని ప్రశ్నించినాడు.

“నల్లమందో, గంజాయియొ లేక ఆబాపతు మరేదో చట్ట వ్యతిరేకమయిన మత్తుపదార్థ మొకటి. బర్వే యిదివరకు కొన్నినాళ్ళవ్యాపారములలో తంటాలుపడిన వాడే సరే! అదిప్పుడే తేల గలదు” అని మారుమాట చెప్పకుండగ రామసింగ బంగీ విడగొట్టినాడు.

దానిలో కొకెయిన్ (Cocaine) చాల సున్నితముగా తయారయిన చిన్న చిన్న పొట్లములలో కానవలసినంత ఉన్నది.

తుకారాము బిగ్గరగా "దేవుడా! మన మీరాసరుకుతో పట్టుబడితిమా ముందున కొకయనుడుగు వేయునవకాశ ముండునా? కొన్ని వారముల నిర్బంధనతరువాత విడుదలయి బయటబడిన చాల యదృష్టవంతులము. అయ్యో! బహుశా మీ పేరుప్రతిష్టలు మేము వినియోగపరచుకొన లేక పోవుటయేగాక వాటిని మలినపరచుచున్నాము కూడను" అన్నాడు.

"అందుచేత నీతుక్కు మనదగ్గరనుండి యెంతత్వరగలో నవతలకు పోయిన నంత మంచిది." అనుచు రామసింగాపొట్లము లన్నియు సముద్రమున విసరివేసి చివర కాకట్టనట్టిపకాగితము, బరకపుగుడ్డ కూడ తగులబెట్టి దానిబాపతు చిన్న యానవాలుకూడ నందు లేకుండ చేసి "మన మిక స్వేచ్ఛగా కూర్చుండి, మనయదృష్టమున కానందించుచు యీశ్వరుని కొనియాడుదము" అని గొణుగుచు సిగరెట్టు వెలిగించి "మనకు పీలుగనుండు గాలితగులు చటులున్నది. తుకారాము! కొంచెము తెరచాప యెత్తగలవా? నీవు వానికి సహాయము చేయు ఫిరోజు" అన్నాడు.

మంచి యనుకూలమైన వాయుసహాయమునను మొగమోటమి వీడి విశ్వాసముగా పనిచేయుచున్న యింజను

సానుభూతిచేతను వారు మందమైన మేఘములతో యరుణ వర్ణము దాల్చి మంచి నేత్రానందదాయకముగా నున్న యాకాశముక్రింద ప్రయాణము చేయు చున్నారు. లాంచి యదృష్టమును దాని నెనకొనుచు మెరయుచున్న కెరటములను ముద్దుపెట్టుకొనుచు నెమ్మదిగా పరుగెత్తు చున్నది.

రామసింగు మధ్య మధ్య దూరదర్శని యంత్రము చేతితో బట్టి గట్టువారిని పెట్టి చూచుచునే యున్నాడు. మధ్యాహ్నము చాలవరకు మీరిన వెనుక నతడు మొదటి నుండియు ననుమానించినటుల, పసుపుపచ్చని గొట్టముగల లాంచియొకటి వారి ననుసరించి యున్నటుల కనుపించినది. అది సర్కారు లాంచిలాగున నున్నది. వీరివైపునకే వచ్చుచున్నది. అది వారిలాంచి పోవుదిక్కుగనే నడచుచు వారిని క్రమముగా చేరుచున్నది. లాంచియాపుచేయుమని అందుండి యొకగంభీరమైన వాక్కు వినుపించినది.

" ఇప్పుడే మంచితమాషా. ఎవరో యొకరు పట్టి కొట్టగలరు. కాని మన కంత యవసర ముండదు." అనుచు రామసింగు లాంచి యాపుచేసి ప్రక్కనున్న పడిచెక్కమీదకు వచ్చినాడు.

ఆ రెండవలాంచి మీదనున్న సర్కారుయుద్యోగి చురుకుగా ముందునకు వచ్చి చాల పెడసరముగా " నేను

మీలాంటి తణిఖీచేయుటకు వచ్చుచున్నాను" అన్నాడు.

రామసింగు పోనియుద్రికము తెచ్చిపెట్టుకొని వానిని నిరాకరించుచు "ఇది కేవలము దౌర్జన్యము. మీ రీవిషయ ములో చాల పొరపాటు పడుచున్నారు. ఇది మాసొంత లాంచి. అదిగో దీనికి బొంబాయి రిజిష్టరు నంబరు కూడను. మే మీ సుగంధము చుట్టివచ్చుట కేర్పాటు చేసుకొని పద్ధతి ప్రకారము బయలుదేరినాము. మాస్వాధీనమున చట్టవిరుద్ధమగు నదేదియు లేదు. మా యీప్రయాణము సంగతి మీ రిదివరకే పత్రికలలో చూచియుందురు. పత్రికాధిపతు లాసంగతి విషయము పరామర్శలు చేయుచు నానాపత్రికలలో వ్రాయుచు న్నారు." అన్నాడు.

అధికారి గురగుప్త లాసుమి "సిపాయీ! ఆసంగతి మేమి దివరకే యెరుగుదుము. మీరింత శ్రమపడి చెప్పనక్కరలేదు. ఈపన్నిక కొంచెము నాకాశ్చర్యముగ నున్నది. మా కసలు సంగతి వర్తమానములుగా తెలియవచ్చినది. అందుచేత మీ లాంచి క్రింద మీద తిరిగవేసి చూచినగాని సందేహనివృత్తి కాదుగదా. ఏమందురు?" అన్నాడు.

" మీరనునది నా కెంతమాత్రమును బోధ పడుట లేదు. మీరు నిజముగా పొరబడియుందురు. సరే తణిఖీ చేసి కొనుడు మీ చిత్తము వచ్చినటుల. చట్టవిరుద్ధముగా దీని మీద మీ కేది కనుపించినను నే నది పూర్తిగా తినివేయు దును" అని రామసింగు నవ్వుచు కచ్చితముగా సమా

భాసము చేసి "మీ రనవసరముగా కాలము వృథపుచ్చుకొనుచున్నారు. అంతకన్న నాకు సుమేమన నంతకన్న నెక్కువ విలువయైన మాకాలముకూడ పాడుచేయు చున్నారని చెప్పవలసి వచ్చినందులకు నాకు చాల కష్టముగా నున్నది. సరే దయచేసి త్వరగా తెమల్చి మమ్ము మాత్రోవను పోనిండు. త్వరగా పోవలసియున్నది." అన్నాడు.

ఆలాంచిలో నుంచి యిరువురుమానవు లమాంతముగా వీరిలాంచిలోనికి వచ్చి పడి యామూలాగ్రముగ అడుగడుగునపైన శ్రద్ధగా తణిఖీచేయ ప్రారంభించినారు. రామసింగంతసేపు నాయధికారిని చూచి వేళాకోళముగా మందహాసము చేయుచుకూరుచున్నాడు.

రామసింగు మరియొకసారి "మీరు విలువగల మీ కాలమును అంతకన్న విలువయైన మా కాలమును కూడ వృథ పుచ్చుచున్నారు. నేను మీకు లోపాయికారీగా చెప్పున దేమన మి మ్మెవరో తుంటర్లు త్రాడుకట్టి యాడించుచున్నారు. ప్రశస్తమయిన యీ యబద్ధపుసమాచారము మీకొసగిన పెద్దమనుష్యుడు సర్కారు యుద్యోగులనీవిధముగా తంటాలు పెట్టుటలో బాగుగ నారితేరినవాడే. పెట్రోలు మితిమీరిన కరీదులో నున్న యీరోజులలో మీరు సర్కారు సొమ్ము అనవసరముగా పెట్రోలుక్రింద యింత ఖర్చుపెట్టుట చాల యన్యాయము. క్షమించుడు. నే నీసంగతు లీపత్రికలకు వ్రాయుదును" అన్నాడు దర్జాగా.

ఆ యధికారి వానిని తీవ్రముగా చూచినాడు. కాని యేమియు మాట లాడలేదు. సావకాశము చాలదు కనుక లాంఛి తణిఖీ చేయుటకు లోపలకు పోయిన మానవు లిరువురును, ఆతడు వెంట వెలుపలకు వచ్చునప్పటికి కొంచెమరగంట పైగా యయినది. వారు తీవ్రముగా గుసగుస లాడుచున్నారు. ముఖములలో కులాసగా కనుపించుటలేదు.

"మే మంతయు చూచినాము. అందేమియు కనుపించ లేదు" అన్నారు.

రామసింగు "మీరు ప్రారంభమున నామాటలు లక్ష్యము చేయనిపోవుట చాల విచారకరమైన సంగతి. దారుణమైన మోసమునకు గురియైనారు. మిమ్ములను చూచిన నాకు చాల విచారముగా నున్నది. కాని కోప మెంతమాత్రమును లేదు. మీరు చాల శ్రమపడి వచ్చినారు. కొంచెము కాఫీ పుచ్చుకొని మరి వెళ్లుడు. లోపల నేమియు ననుకొనకుండ కులాసగా వెళ్లవచ్చును. దాని కేమి?" అన్నాడు.

"ఆహా అక్కర లేదు లెండు. మేము పొరబడి మీ ప్రయాణమున కాటంకము కలిగించినందులకు నాకు చాల విచారముగా నున్నది"

"దాని కేమికాని మీకింతయనవసరపు శ్రమయు ఖర్చును తెచ్చిపెట్టిన యా బుద్ధిమంతుని పిలక పట్టుకొన ప్రయత్నించుట మంచిది. మీ రందరు కృతకృత్యులు కాజాలరు

గాని, అయినను విడిచిపెట్టుట మంచిది కాదు. మీరు కొంచ రగా వెళ్లి రేగవలయునా? అయిన సరే సెలవు. మీ సంగాగు నడిగినా నని చెప్పుము. పుల్లయ్య వ్యాసునవగముక్రింద మిన్నంతమూరి మిక్కడకు పంపినవాడని మూడు బద్దలు కొట్ట వలయునని యుండును వానికి. సరే”

అధికారి వారిలాంచిలోనుండి కాలు వెలుపలపెట్టుట యే తడవుగా తుకారాము యింజను విడిచినాడు. లాంచి యె ప్పటిలాగున కులాసగా నడుచుచున్నది.

మహానదిగా పోవుచున్న సర్కారులాంచినైపు రెప్ప వాల్చక దీక్షగా చూచుచున్న ఫిరోజు రామసింగునైపు చూ చి “మీ రాతాడుముడి, ఆతుటర్రావత అసన్నియు కనిపెట్టి చూచి యుండకపోయినచో మన మీసరికి కాసర్కారులాంచి మీద తలలు మోకాళ్ళమీద వాలవేసికొని కూర్చుని యుం దుము. అయ్యా! తమరు లేకుండిన నేనీవ్యాపారము నేమిచే సియుందునో నాకు తోచుట లేదు.” అన్నాడు.

రామసింగభిమానముట్టిపడ మందహాసము చేయు చు సరే కాని నీవు నెరవేర్చవలసిన మూడవ కార్యము నీవు స్వంతముగా పరసహాయ మేమియు లేకుండగనే పూర్తి చేసు కొని రావలయునన్న సంగతి మరచిపోకుము. నీవివేచనాశక్తి మలామా చేసి సిద్ధపరచి యుంచుకొనుము. ఈప్రయాణము లోని మిగతికాల మంతయు నీవు తుకారాముపాదముల దగ్గర కూర్చుని యడవిలో నివసించుపద్ధతులు ప్రత్యక్షప్రమాణము

లతో నేర్చుకొనుము. కష్టపు నూర్చుకొని కాలక్షేపణ చేయ నిష్టము లేనియెడల నీకు కావలసినవన్నియు నతడు చెప్పగల డు. తుకారాము! నీవు వానికి యుచ్చులు పన్నుటనగయిరా నేర్పి తరువాత భక్ష్యయోగ్యమయిన జీవకోటినిగూర్చి యుప న్యసించుటకు ప్రారంభించు. మొగమోటపడక కానిమ్ము"

౨౬

భారిష్టరు పరశురామపటేలు నాడుయుదయముననే లేచి, ఆఫీసుగదిలో కూరుచున్నాడు. ఆదివారమునాడు తప్పమి గతరోజులలో నత డాలాగున నుదయముననే వచ్చి, యాఫీసు లో కూర్చుండుట యలవాటు. ఆదివారము మాత్రము పట్టణ ములోని స్నేహితుల, చుట్టములయిండ్లకు పోయి చూచివచ్చు పద్ధతి యున్నది. అత డానాడు చాల కంగారుగా నున్నాడు. త నవంటి వకీలాలాగున నాందోళనకు గురియగుట వానికె వి రుద్ధముగా నున్నది.

చాలదినముల క్రిందట వానికి పత్తేదారు రామసింగుద గ్గరనుంచి పరస్పరసంబంధ ముండని తతిభాషలోనయినను మతిమాలిన, విచారకరమైన తంతివార్త యొకటి వచ్చినది. అందు తానును తనవెంటనున్న తుకారాము ఫిరోజులును, చ

ట్టప్రకారము నిషేధింపబడిన నుత్తుపదార్థములు రహస్యముగా రవాణా చేయువ్యాపారమున సర్కారువారిచే బాధింపబడినటుల వ్రాసి సర్కారువారి కదివరకు తెలియపరచుకొనినటుల వా రట్టి వ్యాపారముల చేతను ఇంగ్లీషువారు కారనియును సత్ప్రవర్తన గల గౌరవకుటుంబములను చెందిన గృహస్థులనియును, బుజువుచేయు నాధారములు పంపవలయు ననియును ప్రార్థించుచు వ్రాసియున్నది.

ఆ తంతిసమాచారము "భన్ గాన్" అను నొకప్రదేశమునుండి వచ్చినది. వా రక్కడనే పోలీసువారి నిర్బంధమున నుండి యున్నారు. అందు సందేహము లేదు. బారిష్టరు వెంటనే పనికి ప్రారంభించినాడు. అత డాక్షణముననే యక్కడ నుండు వకీలున కొకనికి తంతి పంపినాడు. "పోలీసువారు బంధించిన నేరగాండ్రను కలిసికొన వలయుననియును, ఆమనుష్యు లనుమానించ వలసినరకములోని వారు కారనియును వాదించు" మని వ్రాయుచు దాని కనుసరణమైన సమాచారము ను యితరయాధారములను పంపినాడు. పిలుగనున్న వారిని జామీనుమీద విడుదల చేయించుచున్నాడు. అదికాక రామసింగు బొంబాయిలోని పోలీసువారి కందరకు విధాయకుడు గావున, పటేలు బొంబాయిలోని పోలీసు శాఖప్రధానాధికారి దగ్గరకుకూడ పోయి రామసింగును, వారియిరువురమిత్రులను విడుదలచేయుటకు తగినప్రయత్నములు చేసి పోలీసువారి యావచ్ఛక్తి నుపయోగ పరచునటుల చేసినాడు.

చాల గందరగోళము జరిగి, ప్రతిసమాచారపత్రముల రాకపోకలు, మితిమీరిన టెలిఫోను వర్తమానములు నడచిన తరువాత సంగతి యాకస్మికముగా మారుతోనున బట్టి, మెక్కడనో గొప్పపొరపాటు జరిగినట్లును, రామసింగు గాని వాని యనుచరులుగాని చివరకు వారిలాంటివాగాని 'భరత్ సార్' ప్రాంతములలో యెవరికిని కనుపించలేదట్లును తేలి, ధృవపడినది. లాంచి పను లక్కడ చేరనాదున నాదులోనివా రక్కడ దిగ లే దన్నమాట. అదికాక మత్తుపదార్థములు రవాణా చేసినందుల కాప్రాంతములలో నామధ్య యెవరిని బాధించి యుండ లే దని కూడా తెలిసినది.

మితిమీరిన యాందోళన కాలవాలముగా బారిస్టరు పరశురామపంతులు లిప్పుడు చాల కంగారు పడినారు. అంచు దరి లేని యీవిపరీతమునకు కారణమేదియు స్ఫురించదు. అత డీంకను యాలాగుననే తుద మొదలు తెలియక కంగారుపడుచునే ఉన్నాడు. అంతలో వానియాఫీసు గంట వాగినది. అతడు లేవబోవుచు గురుతించకాలు లేనిక కస్వరము వానికొరకు వాకబుచేయుట విన్నాడు.

“ఆ! ఆ! అవును. నేనే. పరశురాముడు. ఆ. అవును. ఒంటరిగా నున్నాను”

“సెహబాస్” అని సమాధానము వచ్చినది. కంఠస్వరము హఠాత్తుగా మారి రామసింగు కంఠస్వరమై పోయినది.

అతడు లోపల ప్రవేశించి "మే మిప్పుడే తిరిగి వచ్చినాము. కాని యెవరికిని తెలియనీయ వలదు. మీరు తక్షణము బయలుదేరి 'కాల్బదేవిరోడ్డు' సరసనున్న చెల్నారాం కాఫీహోటలలో నన్ను కలిసికొనుము. మీ రెక్కడకు వెళ్ళుచున్నదియు యెవనికిని తెలియకూడదు. ఏదో యొక పని చెప్పి యెక్కడకో పోవుచున్నటుల నటించవలయును. మీయాఫీసులో చిన్న బెజ్జమున్నదని నాయనుమానము. చాల జాగ్రత్త. తెలిసినదా? పొరపాటు కొంపలేతకు కారణము" అన్నాడు.

పరశురాము తడబడుచు "కాని—కాని. ఆ టెలిగ్రాము సంగతేమి! మీరావిషయములో నాకు చాల శ్రమయు, యాందోళనయు కలుగచేసినారు. దాని యుద్దేశ మేమి! మీరాపాత్రికముల కసలే పో లేదట కదా?" అని యడిగినాడు.

"లేదు. మీకు శ్రమ కలుగచేసినందుకు నాకు చాల విచారముగా నున్నది. కాని యంతవర కవసరము వచ్చినది. మనము తిరిగి కలిసికొన్నప్పుడు సంగతంతయు పూర్తిగా చెప్పెదను. మీ రక్కడకు వీలుచిక్కినంత త్వరలో రావలయును. చాల యవసరము. వృథ పుచ్చుటకు వ్యవధి చాలదు."

పటే లిదివరకుకన్న నెక్కువ కంగారుపడ సాగినాడు. కాని యత డాఫీసునుండి వెలుపలకు పోవునప్పుడు మాత్రము ముఖము నిర్మలముగా నుంచుకొన గలిగినాడు. ఒక విధాయకమైన యభియోగములో మరియొక బారిష్టరుతో నాలోచించుటకు పోవుచున్నటుల పెద్దగుమాస్తాతో మాత్రము చెప్పి

నన్ను టెలిఫోనులో పిలచి బాధ పెట్టకుడు. నిశ్చింతగానుండి పని చూచుకొనవలయును.” అనికూడ చెప్పుచు నతడు వీథి లోనికి పోయి యొక్కడ బండి యెక్కి గమ్యస్థానము చేరి నాడు.

బొంబాయిలో కాఫీభోజనశాలలు చాల కలవు. అందు చాలవరకు సామాన్యరకములే. మనవకీ లిప్పుడు ప్రవేశించిన ది యందొక దానిలోనే. అందులోనికి పోవువారుకూడ సా మాన్యరకములోని వారే. పెద్దరకము వా రక్కడకు పోవుట యెప్పుడును తటస్థించదు.

ఈకాఫీహోటలు మంచి విచిత్రపరిస్థితులలో తయారై యున్నది. దాని యజమాని యనవసరముగా నితరులతో మా టలాడు స్వభావముగలవాడు కాడు. అందులోనికి పోవువారు కూడ నాలాగుననే. వారు వెలుపల మిత్రులయినను లోపల ప్రవేశించినంతనే యొకరితో నొక రనవసరముగా మాటలాడ కూడ దని యొకనిబంధన యేర్పడి గోడలమీద వ్రాసియున్న ది. లోపల యనవసరముగా నొకరితో నొకరు మాటలాడిన తగువులకు యవకాశ ముండు నని యభిప్రాయము. అది గౌర వమునకు భంగముకూడను. అందులోనికి పోవువా రొకరితో నొకరు మాటలాడ వలసివచ్చినచో వా రందునిమిత్తము ప్ర త్యేకముగా నేర్పడిన లోపలిగదులలోనికి పోయి మాటలా డు కొనవలసినదే. అట్టిగదులలో నొకదానిలోనే మనపత్తేదా

రు రామసింగును వకీలు పరశురాముడును, తుకారాము ఫిరోజు లును సమావేశమయినారు.

వారుముగ్గురును యొంతకు వానను గురియై వేళకు తగి నయాహారము నిద్ర లేక నీరసముగా నున్నారు. ఫిరోజు జాద రింగోను మిక్కిలి పాడుగా నున్నాడు. మాహీప్రయాణముక న్న నీగ్రప్రయాణములో మరియు రూపు మారిపోయినాడు.

ఇప్పుడు కిరస్ప్రశ్న చేయుచు "ఆహా! ఈచిన్నవాడిన్ని బాపతుల యనుభవముతో చాలవరకు పూర్ణు చెందినట్లుల కనుపించు చున్నాడు." అని యనుకొని "మీరు త్రోవలో ప డినకష్టము లన్నియు వినగోరుచున్నాను. మీకవి చాలగ తట స్థించియుండును." అన్నాడు.

రామసింగు "మాకు కష్టములు చాలవరకు సంభవిం చినమాట వాస్తవమేగాని, యవన్నియు నిప్పుడు చెప్పుటకు చాలకాలమే పట్టును. అయినను మాకు తటస్థించిన యవాం తరములు మీకు టూకీగా చెప్పుదును" అన్నాడు.

పరశురాముడన్నియు నోరు చాపుకొని, గుడ్లు తెర చుకొని వినుచు మితిలేని యాశ్చర్యమును వెలిబుచ్చి నాడు. అన్నికష్టములు కొంతవరకు స్వతంత్రపరిపాలన కాటపట్టయిన మాహీవంటిప్రదేశములో సంభవించె ననిన కొంత యర్థము న్నది గాని బ్రిటిషుప్రభుత్వసామ్రాజ్యమునకు చెంది ధర్మచట్ట ముల కాలవాలమయిన యరేబియాసముద్రములోని ప్రయా ణములో సంభవించుట చాల యన్యాయ మన్నాడు.

"అందుచేత నేను చివరకు చేసినదేమన, డాక్టరు బర్నే కికావలసిన సమాచార మంతయు నెప్పటి కప్పుడు హర్తాజీ సమకూర్చి యొసంగుచున్నాడు గావున వానిని మారుతోవ నీచ్చుకొని పోవుట మంచిదని, తోవలో మా కొకచోట కనుపించిన పల్లెవాని నొకనిని పట్టుకొని వానికి కొంచెము డబ్బిచ్చి, యతడు భన్ గారు పోయిన సూ కాతంతిసమాచార మందుపనులు చేసినాను. హర్తాజీ యిదివరకు చేయుచున్నటు లగా మియ్యాఫీసుగుమాస్తాలలో నొకనిద్వారా యాతంతిస మాచారము సంపాదించి బర్నేకందజేసినాను. అతడును, ఆ సంగతి వాస్తవమని నమ్మి. మ మ్మాతరువాత బాధించుట మానుకున్నాడు. మేమును తరువాత మంచిగాలి సానుభూతి చూపుటచే యనుకొనిన దానికన్న* కొంచెము ముందుగనేయి క్కడకు రాగలిగినారము. రాత్రియే మేమిచ్చుటకు వచ్చినా ము. మాయిల్లు బర్నేగారి యనుచరుల నిగాలో నున్న దే మో యని సందేహించి యిస లా వైపునకే పోలేదు. సరే. దా నికేమి? మే మిక నీచిన్నవానిని, కాలపరిమితి మించకుండ భ గవదాశీర్వచనసహాయమున నడవి లో ప్రవేశ పెట్ట వలసియున్నది.,,

పటేలు చాల తీవ్రముగా "సరే గాని వానిప్రయాణ ముల కొటంకము కలిగించుటకై యిన్ని మొండిప్రయత్నము లు జరిగినవి కనుక మన మిక నాప్రయత్న మాపుచేయించు

ట మాంచి దనుకొందును. సివిలుకోర్టు వారి దగ్గర యాఫ్పుచేయు టకు తప్పక ............,,

"నే న దీంతకు పూర్వమే ఫిరోజునకు చెప్పియున్నా ను. కాని యాతని దాసుల కిదియ్యకొన లేదు. గతించిన నా పెద నాయనగారి వీలులోని యానొక్క, యాఖరుపరతుకూడ నె రవేర్చవలయు నని పట్టుపట్టుచున్నాడు. అతనికి చాల సరదా గా నున్నది. అందు వానికేవిధమైన ప్రమాదము సంభవించక కుండ నేను పూచీపడుదును. అవసరమైన నే నాయాడవిచుట్టు ను పోలీసువారిని కాపుండునట్టుల చేసెదను. నే నిప్పుడే పో లీసుసూపరింటెండెంటుగారిని కలిసికొన బోవుచున్నాను. అ క్కడవారికి బర్వైసంగతియు, అతి సామర్థ్య యొసర్చిన దుండ గులును పూర్తిగా చెప్పి, అల డికముందు నీమాడవపరతు నెరవేరకుండ చేయు నాటంకము లేమియు లేకుండ చేయించె దను. వారికికూడ బర్వైయనిన చాల యానందమే. తప్పకచే యుదురు. అందు సందేహము లేదు,,

"కాని కీర్తిశేషుడయిన యామునలిరత్నాజీ తనవార సుడు ఫిరోజు వీలులోని పరతులు నెరవేర్చుటలో నిన్ని యు వాంతరములకు గురి గావలయునని కోరియుండడు" అని పటే లు పట్టుదలగా మాటలాడినాడు.

రామసింగు మందహాసము చేయుచు "బహుశా కోరి యుండడు. అయినను ఫిరోజు తప్పక గురియగుటకు సిద్ధపడుచు

న్నాడు .సరే. మీ గీఫ్రూటు యెుక్కడ మాతో భో జన ము చేయుదురా?,,

వకీలు చాల కలత చెందిన మనసుతో, తిరిగి యాఫీసు నకు పోయినాడు. మానవస్వభావసామాన్యమైన వానిహృద య మిప్పుడు వానిని హార్త్రాజీదగ్గరకు పోయి, యతని కుచేష్ట లన్నియు తనకు తెలిసినవనియును, యీప్రవర్తన మంచిదికాదని మానలించుమనియును ప్రబోధించినది. కాని చాలకాలము నుండి వకీలుగా నున్నవాని తరిఫీ దట్టి తొందరపని మంచిదికా దనియును, తగినంత ఋజువు లేకుండ యొకనిని నిందించిన ఘో రముగా నిందాస్పదుడగుటయే గాక చట్టసంబంధమైన యభి యోగమునకు గురి కావలసి వచ్చుననియును హెచ్చరించి వారించినది. కాని చిరకాలానుభవము వాని సాహసమనస్కత్వ ని చిక్కబట్టి వాని యాందోళన ముఖమున కనుపించకుండ జేసి నది. అతడు వాని యాఫీసులో నడుగిడు నంతలో హార్త్రాజీ వా నికొరకు కనిపెట్టుకొని యున్నా డన్న వార్త చెవిని బడినది.

అతడు "ఆహా! హార్త్రాజీగారా! నేను మీకొరకేమి చేయవలయును?" అనియడిగినాడు.

అతడు "మరణించిన మాముసలాయన వీలునామాలో నుద హరించిన వివిధషరతులు నెరవేర్చుట కేర్పచిన కాలపరిమితి చాలవరకు సమాప్తి నొందినది. ఇప్పటి కిక నిరువదియయిదు రోజులు మాత్రమున్నది. మాజ్ఞాతియింకను యడవిలో మూ డువారములు గడుప వలసియున్నది. అత డాయాభరణముల

పేటిక మంపీ తీసికొనిపోయి సక్రమముగా నసలువానికంద చేసి వచ్చినా నని మీరు నా కివరలో చెప్పినారు. సము ద్రప్రయాణము చేసి రెండవపరతుగూడ నెరవేర్చినేమో చె ప్పగలరా మీరు?" అన్నాడు.

వకీలు "ఆహా! ఈదరిశ్యము తెలిసికొన వచ్చినసంగ తిదియా యిప్పుడు.? సరే" అని యనుకొని వారు బాధింపబ డినట్టులు దొంగ తెలిగ్రాము పంపిన రామసింగు దూరదృష్టికి మెచ్చుకున్నాడు. దానిఫలిత మిప్పుడు వానికి మొదటిసారిగా బోధ పడినది. అతడు "సరే మంచిది చెప్పినారు కానీ? నాబుర్ర లోని సంగ తొకటియు వెలుపల పడదు" అనుకున్నాడు. వా ని కృత్రిమపు మందహాస మిప్పుడు సొంపు దేరినది. అతడు చా ల నమృదువుగా "అయ్యా! ఈ బాపతు సంగతులన్నియు వీలు కార్యకర్తయయిన పత్తేదారు రామసింగుగారికి సంబంధించి యుండును. కాని మా కెంతమాత్రము సంబంధము లేదు. ఆ వీలునామసపరతులు పూర్తిగా కొనసాగకుండు విషయములో మీకుకూడ కావలసినంత సంబంధ మున్నది గనుక మీకు కా వలసిన యావత్తు సమాచారమును రామసింగుగారి నడిగి తె లిసికొన గలరు. మీ కవసరమైన యెడల వారివిలాసము మీ కొసంగుదును" అన్నాడు.

హర్నాజీ ముఖము ముడిచినాడు. అత డొకను డీయు పటేలు నిట్టి సత్తుతప్పెలా రకములోని వా డని గట్టిగ నమ్మి

యున్నాడు. ఇప్పు డత డానిని గూర్చి యభిప్రాయము పూర్చు కొన ప్రారంభించినాడు.

హాస్యాకే నెమ్మదిగా "నీటిలోని షరతులు నెరవేర్చుట లో రాణుసింగుగారి కొంత పాలు కనుచున్నట్లు కనపించు చున్నది. ఆయన యీవిషయమున హాస్యముగా ప్రవర్తించుచు న్నాడని నే నభిప్రాయపడుచున్నానని చెప్పవలసి యున్నది. మహాత్మా ఫిరోజు మాస్టారు మొదటగా పోవలయునని మన మభి ప్రాయపడినారము. కాని వానితోడు రాణుసింగును, వానియ నుచరులునుగాక యన్నివిధముల ఫిరోజునుపోలియున్న మరియొ కమానవుడు కూడ పోయెనట" అన్నాడు.

పటేలు లింకను మరణశాసనము చేయుచునే యున్నాడు. కాని వానికన్నులలో నొకవిధమైన తీవ్రత కనుపించుచున్నది అతడు నెమ్మదిగా ప్రారంభించి "వారు చాల మూఢపనిచేసి చేసినారు. లేనియెడల నాయాభరణపేటిక సురక్షితముగా గ మ్యస్థానము చేరియుండును. సురక్షితమేమి యసలే చేరియుండ కపోవును. ఆప్రయాణముగూర్చియు, దానిలో తటస్థించిన కొ న్నిప్రమాదములను గూర్చియు నీ వొకసారి ఫిరోజు నడిగి తీ రవలయును. ఆప్రయాణము చివరకు జయప్రదముగా కొన సాగకూడ నెవరో మధ్య చాల నాటకములు కలుగ చేసి రట. అందులోని షరతుల నతిక్రమించిన దేదియులేదు వారు. ఫిరోజు మొదటిగా పోవలయునని వీలులో నెచ్చటను సూ చించబడి యుండలేదు. అందు 'అత డొకబాగీ షలానావారి

కంద జేయవలయు' నని మాత్రము వ్రాసియున్నది. నే రేమి యు లేదు. అతడు సరిగా సదే చేసినాడు.'' అని మందలింపు గా చెప్పినాడు.

''కాని యీ సముద్రయానము మేండాడు యిరువురు నావికులను మాత్రము వెంటబెట్టుకొని ముగించవలయు నని స్పష్టముగా వ్రాసియున్నది. అయినప్పటి కతడు రామసింగును వానిసహాకారిని వెంట బెట్టుకొని పోయినా డని నాగట్టి న మ్మకము. అది కాదనలనుంత స్పష్టమయిన యుతికి ప్రమాణ. కా డందురా మీరు?'' అని హర్నాజీ తీవ్రముగా యరచినాడు. వానిసౌమ్యత వానిని వాలువరకు విడిచిపోయినది.

పరశురామపంతులు యెప్పటికన్న తాజాగా ''అయ్యా! తిమజ్ఞాపకశక్తి కొంతవరకు పొరపడి యుండును.'' అన్నాడు. వాని కాసంగతి కొంచె మానందము కలుగచేయ ప్రారంభించి నది. అతడు నెమ్మదిగా తిరిగి ప్రారంభించి ''అయ్యా! మీరు కావలెనన్న నే నాదస్తావేజు యిప్పుడే చూపించగలను. ''ఇద్ద రు మనుష్యులు మాత్రము'' అని యందున్న దని నేను చెప్పి నప్పుడు మీరు నమ్మవచ్చునుగదా! రామసింగును వానియ నుచరుడును మనుష్యులని చెప్పినప్పుడు తిమరు తప్పక యంగీ కరింతురు. అదికాక, వాదమునకు వారు వారిరువురును చాల కాలము సముద్రప్రయాణము చేసియున్నందున వారిరువురు నావికులమని చెప్పుకొనుట కవకాశ ముండునని నాసమ్మక ము. రామసింగునకు సొంతముగా యోడ నడిపించు యర్హాతి

యున్నదని నేను చెప్పగలను. నేను మీకు చెప్పగలిగిన దింత కన్న నేమయిన నున్నదా?" అన్నాడు.

ఉద్రేకమున హర్నాజీముఖము పాలిపోయినది.

అతడు తీవ్రముగా "అయితే వారీసముద్రప్రయాణమును బ్రాంగ్ గావించి వచ్చితిరా! ఇపు డెక్కడ నున్నారు? రహస్యముగా మాత్రుపదార్థములు రవాణా చేసినందున వా రెక్కడనో నిర్బంధమున నున్నారని విన్నాను. అంతవరకు నిజ మేనా?" అని యడిగినాడు.

"ఆహా! స్నేహితుడా; నీయుద్రేకత వారియెడల నీకు స్నేహమును వెల్లడిపరచినది." అని బార్ట్రరు తనలో ననుకొని పైకియు లేనిపో నిలాగున బిగ్గరగా "ఆహా. నిజముగాదా? అంతవరకు జరిగియుండిన చాలకిష్టమే. మీ కది యెప్పుడు యే లాగున తెలిసినది? మీ రది యాకణమునసే నాకేల తెలియపరచితిరి కాదు? మీరు గౌరవమర్యాదలు కలవారగుటచే తను, పోలీలులోని షరతులప్రకారము లబ్ధి పొందగలవా రగుటచేతను, వినిన తక్షణమే నాకు తెలియపరచుట మీవిధాయకకృత్యము కాదా?" అని మృదువుగ మందలించినాడు.

"సముద్రప్రయాణమును గూర్చిన యొకవ్యాసములో మాష్టాతి పేరు వ్రాసియున్నటుల, వార్తాపత్రిక చదివిన యొక సర్కారుయుద్యోగి చెప్పినాడు. నాకు మాయిరువురకు బాంధవ్య మున్నదని తెలిసి యత డాసంగతి నాకు చాల రహస్యముగా చెప్పినాడు. అతడాలాగున చేయుటలో యాఫీసునిబంధ

నల నతిక్రమించినాడు. అందుచేత నాసంగతి నలుగురకు వెల్ల డిపరచుట నా కంతసబబుగను న్యాయముగను కనుపించనందున నేను నోరు మూసికొని యూరకుండ వలసివచ్చినది. అది సంగతి" అని సగర్వముగా సమాధానము చెప్పినాడు.

"అయితే నాసంగతి యిప్పుడు మాత్రము చెప్పు టెందులకు? పత్రికలలో ప్రచురమయిన సంగతికి రహస్య మేమిటి? అదికాక నే నాసంగతి యేపత్రికలలోను యెన్నడును చూచియుండలేదే!" అని పరశురాముడు చెప్పుదెబ్బ కొట్టినటుల పెడసరముగా చెప్పినాడు.

హార్జాజీ క్రోధమున స్వాధీనము తప్పి యుద్రేకముగా పెద్దపెట్టున నరచుచు చిందులు త్రొక్కుచు "ఫిరోజు ప్రస్తుత మెక్కడ నున్నదియు నేను తెలిసికొన గోరుచున్నాను. వీలులోని షరతులు వారెంతవరకు నెరవేర్చుకొని వచ్చినదియు తెలిసికొనుటకు నాకు కావలసినంత హక్కున్నది. నే నదే యడుగుచున్నాను?" అని గద్దించినాడు.

"అయితే దయయుంచి మీ రీసమాచారము వీలు కార్యకర్త నడుగుడు. దానిలోని షరతులు క్రమముగా నెరవేరునటుల చూచుపూచీ వారిదే. తరువాత తమరు స్థిమితము తప్పి మాటలాడ నారంభించినారు. గనుక నిక మాయాఫీసునుండి వెలుపలకు దయచేయుట మంచిది" అని వకీలు తాజుగా సమాధానము చెప్పి బంట్రోతు కొరకు గంట వాయించినాడు.

హర్తాజీ వకీలుగొంతుక కొరుకులాగున గ్రుడ్లు తెరచి వానిని తదేకదృష్టితో చూచినాడు. కాని వెంటనే సరుచుకొని, కోప ముపసంహరించుకొని గిర్రున తిరిగి పెద్దయంగలు వేయుచు చరచర వెలుపలకు పోయినాడు. వకీలు వానివెనుక పడి గుమాస్తాలుండు హాలుగుమ్మమువరకు పోయి ప్రక్కను నక్కి నిలచి, యాతడు వెలుపలకు పోవునప్పుడు గుమాస్తాల వాలకములు కనిపెట్టి చూడసాగినాడు. వారిలో చాల నూతనముగా నందు ప్రవేశించిన కుర్రవా డొకడు వెర్రిముఖము వేసికొని తీవ్రముగా పోవుచున్న హర్తాజీని భయాక్రాంతుడై కనిపెట్టి చూచుటయే కాక, యతడు పోవునపు డేదియో కొంత గుసగుస లాడుటకు కూడ సాహసించినాడు.

౨౭

బారిష్టరు తిన్నగా వానిగదిలోనికి పోయి, ఆకుర్రగుమాస్తాను పిలిపించినాడు.

“ఆహా! అబ్బాయి! నీవు వానికి కావలసిన సమాచారము నొసంగు చున్నందులకు, హర్తాజీ నీ కెంత యిచ్చినాడు? దయచేసి చెప్పు” అని కర్రపడిగా నడిగినాడు.

"నాకు — నాకు — అతడు — అతడు — ఆ — —."
అని నసికి కుఱ్ఱవాడు నోరు మూసికున్నాడు.

"అవును. నా కంతవరకును తెలియునులే. నిజము చెప్పివేయుము. నిన్ను క్షమించెదను. ఏమి? నిన్ను పాడుచేయుట నా కిష్టము లేదు. చిన్నవాడవు. డబ్బు యెట్టివానినైనను కక్కుర్తి పరచును. ఊఁ. చెప్పివేయుము త్వరగా. ఉన్న సంగ తంతా" అని బుజ్జగింపుగా నడిగినాడు.

చెప్పుట కేమున్నది. చాల స్వల్పము. మొహాతాఫిరోజు ధనార్జనకై చేయు ప్రయత్నములలో, కుఱ్ఱవానికి తెలిసినంతవరకును హార్తాజీకి చెప్పుచుండుటకై హార్తాజే కుఱ్ఱవానికి కొంత లంచ మిచ్చినాడు. కుఱ్ఱవానికి తెలిసినంతవరకును, అతడు హార్తాజీ కందజేసినాడు. అదీ సంగతి. కత్తి వ్రేటునకైనను రక్తము వెలువడునట్టులలేని యూకుఱ్ఱవాని ముఖము న కీలుమాటలతో నల్లగా మాఱిపోయినది.

"సరే. నీ విక పోయి నీపని చూచుకొనుము. నీవు తిరిగి హార్తాజని కలిసికొనినయెడల, నీ వసలుసంగతి నాయెడట నంగీకరించినట్టుల వానికి తెలియనీయ కూడదు. అవసరమయిన నీవు వానికి చెప్పవలయు నని నేను నీను కొంతసమాచార మొసగెదను. ఇక ముందు నాకన్నొకటి నిత్యము నీమీద నుండును. నీపురోభివృద్ధి పూర్తిగా నీభావిప్రవర్తనపై నాధారపడియున్నది. అదిమాత్రము మనసున నుంచుకొనుము. ఇ

ట్టి నీతిమాలిన ప్రవర్తనకై మాయాఫీసునుండి తొలగించబడిన (Dismiss) గుమస్తా మరియొకచోట నవుకరీ సంపాదించుట సర్వసాధారణముగా జరుగదు. తెలిసినదా? ''

"అదీ సంగతి. సరి?" అని పలికి వకీలు తలవంచుకొని పని చూచుకొన సాగినాడు.

ఈలోపున రామసింగానాటి సంగతభాగ మసనసరము గా వెళ్ళబుచ్చుట లేదు. తుకారాము నౌకరు వేషమున చాల రహస్యముగా రామసింగు యింటివెనుక దొడ్డిలో ప్రవేశించి మోటారుకారు సరుకులో నింపి, కావలసినసామానుతియు పడినదని బాడి ప్రశస్తమయిన పనిలో నున్నదని స్థిరపరచుకొని దానిని తిన్నగా రామసింగు, ఫిరోజు మకాముచేసిన హోటలు వెనుకగుమ్మముదగ్గరకు తీసికొని వచ్చినాడు. అక్కడనే రామసింగును, ఫిరోజును, ఆబండిలో ప్రవేశించినారు. రహస్యముగా పని వేరుగ చెప్ప నక్కరలేదు.

అంతట రామసింగు "దక్షిణదిశకు!" అని తుకారాముననాజ్ఞాపించి "అబ్బాయి ఫిరోజు! నిన్ను, నీ వికముంచు మూడువారములు గడుపవలసిన యడవిప్రాంతమున విడిచిపుచ్చుదును. నీవును, తుకారామును 'బూర్కునాదు' దగ్గర మకాము. నేను నీవు కాపురము చేయవలసిన యడవి మునుపుగపోయి చూచివచ్చెదను. బుద్ధిమంతుడు బర్వే వచ్చినయెడల నీసారి వానికి తగిన ప్రాయశ్చిత్త మగును. నే నింతకు మునుపు వరకు టెలిఫోనుదగ్గర యనవసరముగా కూర్చుంటి ననుకుంటి

రా? తుకారాము! జాగ్రత్త సుమా! మమ్ముల నీవ ప్రయాణా రంభమునకే ఎక్కడలో పెట్టకు" అన్నాడు.

తుకారాము కులాసగా వుండ్లీకలించుచు హరిదాలు వసుగుపేసకొని ప్రక్కనేపోవుచున్న పెద్దమోటారు డ్రైవరునకు సలాము చేసినాడు. రాముసింగది చూచి దాసితో నుండి క్షణకాలము వెలుపలకు ముఖము చూపిన యెవనినో చూచి తల విసరినాడు. తరువాత నాకారు రయ్యిమని ముందుకు పోయినది.

" అతడు మనస్నేహితుడు. పోలీసు యిన్స్పెక్టరు హరాక్ సింగు. అతడుకూడ నక్కడికే పోవుచున్నాడు. ఈసారి బన్దోబస్తు వ్యతిరేకముగా చాలమంది యున్నారు. తుకారాము! వారు చాలగ పోవువరకు నీవు కొంచెము నెమ్మదిగా పోనిమ్ము. అని" చెప్పి రామసింగు తీరుబడిగా సిగరెట్టు వెలిగించి యాలోచనలో మునిగిపోయినాడు.

సాయంకాలము సమీపించుచున్నది. రామసింగు ఫిరోజు నక్కడిహోటలులోని వెనుకగదిలో తుకారాము పూచీలో జాగ్రత్తపరచి యెంతవచ్చినను గడపదాటి వెలుపలకు పోనీయవలదని మరియు మరియు హెచ్చరికచేసి "నీవిక్కడ చాల సురక్షితముగా నున్నావు. కాని యడవులలో సంచరించుటకు ప్రారంభించిన తరువాతమాత్రమే మాలాగున ననజాలము. నిర్ణయించిన కాలము పూర్తియగువరకును నీ కాపదల

మున నిండుచున్న చిన్నచెరు వొకటి సమీపించువరకు కొంతమాత్రమును చప్పుడు చేయకుండ చాల యోపిక పట్టి పోయినాడు. దానినుండి వెలువడుచు ప్రవహించు నీరు దూరమున దిక్కు దివాణము లేనియున్న యొక పనికిమాలిన పాత్రయొకటి దగ్గరకు గొంటునాలుగా నున్న సన్నని మార్గమున సబోవుచున్నది.

"మనుష్యమాత్రుని కగపడకుండు యడవులలో, దూరమున, మారుమూలల నున్నయీపాత్రయు గూడ కొంతకాలమునకిందట మహాత్ముని సేవకుల కాటుపట్టులై యుండుననుకొనుటలో యాశ్చర్య మేమున్నది. అవి యిప్పుడుకూడ నట్టికార్యముల కవసరమును బట్టి సానుభూతి చూపగలవు. మరణించిన రత్నాబి కామాత్రము తోచియుండిన నతడు పిలులోని మూడవపరతు నెవ్వరెర్పుటు నట్టి దిక్కుమాలిన ప్రదేశ మేర్పాటు చేసియుండెడు. పర్హాజీ యింతకాలమునుండియు నాందోళన పడుచున్న పత్త్య కొనసాగుట కింతకన్న యనుకూలప్రదేశ మింకేది యుండును? మహాత్మాఫిరో జట్టియడవిలో మూడువారములు తిరుగులాడుచును కాబోలును పాపము తిండిలేక కడుపుకాలి. బహుశా కాస్త విశ్రమించుకొనుటకైన నోపిక లేకుండ చాటున నక్కియున్న యొకయాకారము, హఠాత్తుగా నొక పెద్దచెట్టుకొమ్మ నెత్తిని బడి తగిలినగాయము. ఒకటి రెండురోజులు తరువాత నాకొమ్మ సర్వసాధారణముగా సన్నికొమ్మలు పడినటుల పట్టు తప్పిపడినదో లేక ప్రయత్నపూర్వకముగా మానవుని

చేతులలో నూగులాడింపబడినదో యెవరును నిర్ధారణచేసి చెప్ప జాలక పోవుట"

అంత డాంచెరుపువారను డిట్టమైన యొక ద్వారకక్రిందను నిలచి, యొకటి రెండునిమిషములు నిదానించి నెమ్మదిగా సీల వేసినాడు. వెంటనే కొంతదూరమునుండి మఱియొక యీల సమాధానము వచ్చినది. తరువాత నొకవ్యక్తి నెమ్మదిగా గట్టువాను వానివైపునకు రా సాగినది.

"ఆఁ ఇన్స్పెక్టర్! సమాచార మేమైనా?" అని రామసింగు తొందరగా నడిగినాడు.

"ఆహా! కోరినదిగా నీవు చెప్పిన పద్ధతివిూద వాకబు చేసినాను. ఖచ్చితముగా నీవు చెప్పినలక్షణములు యున్నలాంచి యొకటి నిన్నటిప్రొద్దుట నాలకట్టే రేవులో కనుపించినది. ఈవేళమాత్ర మచ్చట కనుపించదు. కావలసిన పెట్రోలు యితరసామగ్రితోపాటు తినుబండారములు తీసికొని రాత్రి యెక్కడికో పలాయిన మైనదట. విూరు చెప్పినప్రకార మాయా చోట్ల మనుష్యుల నేర్పాటు చేసినాను. అది. సరే దాని కేమిగాని డాక్టరుబర్ట్వే యీరాత్రి కిక్కడకు తప్పక వచ్చునని నీ వభిప్రాయపడుట కాధార మేమి?" అని యిన్స్పెక్ట రడిగినాడు.

"కేవలము, నాకు వానిపద్ధతులతో కల పూర్వానుభవమే. మేము సముద్రప్రయాణము జయప్రదముగా కొనసాగించుకొని వచ్చితి మని వానికి పూర్తిగా తెలియును. ఏలనన

నీస్వాతంత్ర్యము మే మింటికి వచ్చుత్రోవలో మాకు కనుపించిన చిన్నెలాంటి వారిదే. ఆ సందేహ మెంతమాత్రమును లేదు. దానితోపాటు సంగతిసందర్భము లెప్పటి కప్పుడే వాని కందజేయుటకు ఇక్కడ డొక డుండి యుండును. అదికాక ఫిరోజుమీాద నడపదగిన కార్యము చేయ స్థిరపరచుకొనిన యాతఁడా ప్రదేశ మొకసారి తప్పక చూడవచ్చును. తరువాత నే కదా వాఁడు తన్నికై యేర్పాటు చేసికొని యాచరణలో పెట్ట ప్రయత్నించుట"

"చాల మంచియూదమైన లక్షణమే" అని హారాకర సింగు మూాలిగినాడు.

"ఆలాగే మరి. అయినను నీ విక్కడనే యుండి వాని రాకకొరకు నిరీక్షించి యుండదగిన వ్యాపార మిది యని నా యభిప్రాయము. నీవు వానిని పట్టుకొన గలిగితివా, బంగారు పట్టీలు నీభుజముల నలంకరించ గలవు"

"నే నంతవరకు చేయు భాగ్యము పట్టిన నది నీసుకృత మనవలయును. రామసింగు! నీవు చాల మంచివాడవు. నీపద్ధతులు నా కెల్లప్పుడు ననుకూలముగనే యుండును. మన మిప్పు డేమి చేయువలసి యున్నది?" అని యడిగినాడు.

"కొంతసే పిక్కడనే యాగి వానిని నివ్వెర పుచ్చుటయే. అందుకు మన మిప్పుడు నిలచియున్న ప్రదేశమే చాల ప్రశస్తమయినది. అత డీమార్గముననే రావలయును"

అత డాశ్చర్యముగా "ఆ! ఏమి? ఎందుచేత? నీ కాష్ఠలముకూడ సరిగా తెలిసియున్నటుల కనుపించు చున్న ది?" అన్నాడు.

"ఆ! అవును. నే నిచ్చటకు కొంత సేపటిక్రిందట నే వచ్చుటచేత నీ ప్రదేశ మంతయు చూచు నవకాశము కలిగినది. ఈయింటి కాపలనున్న మోకాళ్ల లోతుబురదలో కాళ్లీడ్చుకొనుచు నడచుట వాని కిష్టములేని పక్షమున యతఁ డీవైపున నే వచ్చి తీరవలయును. చాలకాలమునుండి యీప్రదేశము చూచెడు దిక్కులేనందున నీ చెరువులోని నీరు పొర్లిపోయి యవతల సాపుగా ప్రవహించు నాధారములేక యక్కడ నిలువయై నేలంతయు నాని కొన్నివారలగజములవరకు బురదక్రింద తయారయినది. దాని కవతల పెద్దడొంకలు, ముండ్లకంచెలు పెరిగి పోయిన చిట్టడివి యున్నది. ఎవరయిన చేతిగొడ్డలి పుచ్చుకొని నరుకుకొనుచు మార్గము చేసికొని రావచ్చునుగాని కులాసగా నిశ్శబ్దముగా మాత్రము ప్రయాణము జరుగదు. దానికిని యవతలనున్న ప్రదేశము కావలసినంత కాళీగను, స్వేచ్ఛగను యున్నదిగాని యక్కడ నీవు కాపుంచిన మనుష్యులు సిద్ధముగా నుందురు కదా! ఏమి! ఉన్నారా?" అని పత్తేదా రడిగినాడు.

"ఆ! కాని వాని కిష్టమైన సందు దూరివచ్చుట కాటంకమేదియు నుండదు కదా?"

"ఉండదు, కాని యీతడు సముద్రపువారనుండి వచ్చును గనుక రెండవమార్గమునుండియే వచ్చును." అనుచు రామసింగు కుడివైపు చేయిచాచి చూపి "ఆలాగయిన యితఁ డా మధ్య కాపిగానున్న చెక్కడాటిరావలయును. ఈ రాత్రి యాకాశము చాల నిర్మలముగా నున్నందున మనము వానిని చూడగలము. అదికాక నేలంతయు క్రిందపడి యెండిపోయిన చిన్న మొక్కలతో నిండియున్నందున యితఁడు వానిని త్రొక్కకుండ తప్పి మరొకచో నడచుటకు వీలులేదు. కావున మనము వానిరాక తప్పక వినగలము" అన్నాడు.

ఇనస్పెక్టరు హార్కరసింగు "వానిసంగతి మన కసలే తెలియకుండ పోవునేమో నని నాభయము. అట్లొకవేళ మనల నిప్పుడు తప్పించుకొని దాటిపోయినను నేను వానిలాంటి పోలికలు చుట్టుపక్కల కిదివరకే తెలియపరచితిని గనుక సంత మెక్కువ దూరము పోజాలడు. సరే. ఇక అసలు సంగతిసందర్భములు ప్రస్తుత మేలాగునున్నవో కొంచెము తెలియఁజెప్పుము?" అని యడిగినాఁడు.

హత్తేదారు రామసింగు యినస్పెక్టరు హార్కాజీని ప్రారంభమున రయిలుస్టేషనులో విడచిన దాది యిప్పటివరకు రెండుప్రయాణములలో జరిగిన యావత్తు వృత్తాంతము క్లుప్తముగను, చాలమెల్లగను చెప్పి, వాని యాతృత నడచినాడు.

సంగతి చివరవరకు తీరుబడిగా వినిన యినస్పెక్టరు హా

ఠాకూరసింగు "హుం" అని మందముగా గర్జించి "హార్నాజీయే దీని కంతకు కారణభూతుడు. వాడు చాల జిత్తులమారి. నేనింతకాలమును వానిని నిగాలోనే యుంచినాను. వానికి వ్యతిరేకముగా సంగతేమియు నంతగా తెలియ రాలేదుగాని యతడింతకాలమును నటించు చున్నటుల కంపెనీల ప్రతినిధి కాడు. వర్తకముతో వాని కేవిధమైన సంబంధమును లేదు. వానికి రాత్రుల తెల్లవారును డబ్బుపెట్టి పేకాసు నలవాటున్నది. దానిమూలమున వానికి కలిసివచ్చున దంతగా లేదు. అంతకన్న మనకు కలిసివచ్చు సమాచార మేదియు లభించలేదు. కాని యొక్కటిమాత్ర మున్నది. అతడు క్రమముగా బాడకెత్తి పోవుచున్నాడు. అత డేదో యొకవిధముగా మీ చిన్నవానిని పాడుచేయుటలో కృతకృత్యుడయి ముసలివాని యపారమైన యాస్తి సంగ్రహించ గలిగిననే తప్ప లేనియెడల వానిబ్రతుకు అల్లరి పాలే" అన్నాడు.

అంతట రామసింగు వాని కడ్డువచ్చి "నాకు తెలిసినంతవరకు వానిబ్రతు కేవిధముగా నయినను అల్లరి పాలే. దాని కేమి? మన కాసంగతి చివర కేలాగున జరిగినదియు తెలియ గలదు. ప్రస్తుతపుసంగతి చూచు కొందము" అని గొణిగినాడు.

వారు చాల నిశ్శబ్దముగా నిలచినారు. ఒక యరగంట గడచిపోయినది. ఎక్కడను గాలి లేదు. చెట్లసందున యక్క-

డక్కడ బయలుదేరిన గుడ్లగూబల గుబాళింపులును చెట్లమ ధ్య మేతకోసము బయలుదేరిన చిన్న చిన్న జాతుపుల కదలికల చప్పుడును తప్ప యితరధ్వని యేదియు వినుపించుట లేదు. అంత నానిశ్శబ్దమును చించుకొనుచు హఠాత్తుగా బయలుదేరి న గింగురురావ మేదియో విని కునికిపాట్లు పడుచు నిశ్చలము గా కాపలా కాయుచున్న పహరావారు కంగారుపడి లేచి ని లచినారు. హర్కారసింగు చేయి చురుకుగా జేబులోని పిస్తో లుమీదకు పోయినది కాని రామసింగు యెగతాళిగా లోలో పల నవ్వుకొని "హర్కారు! నీవు లోకానుభవ మెంతమాత్రి మును లేని పట్నవాసపు పెద్దన్నయ్యవు. ఆధ్వని విని భయ పడినావు. అందు మన మాటంకపరచగలుగున దేదియు లేదు. ముంగిస యొకటి చెవులపిల్లిని పట్టుకున్నది. అంతే. వినుటకు చాల యసహ్యముగ నున్నను యడవిలో సంచార మవసర మున్నవారికి తరుచు యనుభవ మగుచుండు సంగతు లివే. అ దిగో! అ దాగిపోయినది చూచితివా? క్షణకాలములో పరిస మాప్తి నొందును"

"అయితే నేనుకూడ నొకముంగిసనై యుండిన బా గుండును." అని యినస్పెక్టరు నవ్వినాడు.

ఒక క్రీనీడ నెమ్మదిగా వారిని దాటి యంతకు పూర్వ మావింతధ్వని బయలుదేరిన దిక్కునకు సాగి పోయినది. దా నివెంటనే యొక తడపడ శబ్దముతో విజయసూచకమైన యొ క గుబాళి పుత్తో గొళ్ళసందున నేదియో నల్లనివస్తు వొకటి చి

కట్టబట్టుకొని యాక్రీనీడ తిరిగి దాని యథాస్థానమునకు రెప రెప లాడుచు పోయినది. తరువాత నంతయు నిశ్శబ్దము.

"అది గుడ్లగూబ. ఆముంగిసను పట్టుకున్నది." అని రామసింగు మందహాసముచేసి "నీ వీసారి గుడ్లగూబవైపు జూడుము. అదునా! అదా చెట్టుమీదకు పోయినది" అన్నాడు.

వెంటనే బయలుదేరిన యొక వింత దప్పు డాముంగిస చెవులపిల్లి కేమి చేయవలచుకొనినదో దానికి సరిగా నదే జరుగుచున్నటుల కనుపించినది. గుడ్లగూబ దాని యాహారమును పట్టుకొని రెక్కలమీద నిశ్శబ్దముగా నక్కడనుండి లేచిపోవువరకును నాపాంతముల నున్న చిన్నజాతు వేరియుకూడ తుప్పలక్రింద దూరి వెలుపలకు రాలేను.

కొంతసేపటిలో నాసందడి మరియొకసారి బయలుదేరినది. ఇదివరకు లాగునగాక నీసారి కుడివైపున దూరముగా నున్న చెట్లవరసలో నెక్కడనుండియొ చిన్నకొమ్మ పెళుక్కున విరిగినటుల కనుపించినది. రామసింగు చురుకుగా హర్కారసింగు నొకమోచేతిపోటుతో హెచ్చరించి జేబునుంచి పిస్తోలు నిశ్శబ్దముగా వెలుపలకు తీసినాడు. వానికన్నులు దూరమున చెట్లమరుగున నున్నగాఢాంధకారమును చొరచుకొని దీక్షగా చూచినవి.

తిరిగి కదలిక బయలుదేరినది. వెంటనే నీడయొకటి దట్టముగా నున్నయాచెట్టు క్రీనీడలో కొంతవరకు ముందునకు జరిగి తరువాత దానినుండి వేరయి దూరముగా సలచినది. నరి

కివేసిన చెట్టుమొదలని భ్రమ కలుగులాగున నాలాగుననే క్ష
ణకాలము నిశ్చలముగా నిలచి నెమ్మదిగా ముందునకు కదలి
పోసాగినది.

౨౮.

ఒక మనుష్యుడు! అవును మనుష్యుడే! సందేహము
లేదు. ఏలనన యతడు మరియొకసారి యాగి నప్పుడు వానికి
స్వభావసిద్ధమయిన పద్ధతిలో తల వెనుకకు విసరినాడు. చీక
టియైనను రామసింగది గురుతించక పోలేదు. అతడు బర్వే
యే! రామసింగాదినుండియు స్థిరపరచినటుల సరిగా వచ్చినా
డు, అతడాలాగుననే నిలచి, దూరమున నిర్మలాకాశమునం
దు యొంటరిగా కనుపించుచున్న యింటివైపు క్షణకాలము
చూచి అంతయు నిర్మలముగా నున్నదని నిశ్చయించుకొని
యా చిన్న చెరువువైపు నిర్విచారముగా కాళ్ళు చాచుకొని న
డచి యక్కడ నున్నయాచెట్లగుంపులో ప్రవేశించినాడు. మరి
కొన్ని సెకనులలో నతడు కండ్లు మూసికొని యంతవరకు వా
నికోసము కనిపెట్టుకొని యున్నవారల చేతులలోనికి తిన్నగా
తనంతతానే పోయియుండును. కాని యంతలో నపసవ్యముగా
వచ్చిన తుమ్ము ఆపుకొన ప్రయత్నించుచు యినస్పెక్టరు హ
ర్కారసింగు చేసిన గురగురధ్వని వానిని రక్షించినది. దోమ
యొ లేక నట్టిది మరియొక కీటక మేదియొ వానినాసికారంధ్ర

ములలో దూరుటచే నాతపని జరిగినదని యతడు తరువాత స్పష్టపరచినాడు.

ఏమయిన నేమి? కార్యభాగమునకు కారణ మయినది. బక్వే చాగున గల చెట్టువెనుకకు తప్పుకున్నాడు. రామసింగు ఇనస్పెక్టరు చేయిపట్టి యీడ్చుచు తానుకూడ మరియొక చెట్టుప్రక్కకు పోయి, వెనుక గోడప్రక్కను, ఆయుడవిలో నలుప్రక్కలను కాపున్న పోలీసువారిని హెచ్చరించుటకై తక్షణమే పిస్తోలు పేల్చినాడు.

అతడు బిగ్గరగా "బక్వే! లొంగిపో! నీపని యయినది. లాభము లేదిక. మిస్తాను కాపున్నారు!" అని కేక వేసినాడు.

బక్వే మనోధైర్య మంతమాత్రమును చెడదని స్వరమున నెకసక్కెము చేయుచు, తాజాగా సమాధానము చెప్పినాడు. "ప్రియమైన రామసింగు! ఈ క్షణములోని యుద్రేకత నిన్ను కంగారు చేసినందులకు నాకు నిజముగా చాల విచారముగా నున్నది. నన్నెవరును ముట్టడించ లేదు. ముట్టడించబడుట కూడ నా కిష్టము లేదు." అని సమాధానము చెప్పినాడు.

ఇనస్పెక్టరు పిస్తోలు పేల్చవలయునన్న తొందరలో మరుగునుండి క్షణము వెలుపలకు వచ్చినాడు. అతిసాహసికస్వభావుడైన యాడాక్టరీయవకాశము దొరక పుచ్చుకొని యినస్పెక్టరు వెలుపలకు వచ్చియు వచ్చుటలో వానినెత్తిమీద

టోపీ గుండుతగిలి టోపీ క్రిందపడినటుల పిస్తోలుతో ఒకదెబ్బ కొట్టినాను.

"లోపలకు రా. వాని నక్కడనే పట్టి యుంచుము." అని రామసింగు రహస్యముగ తీవ్రముగా నని బోర్లపరుండి డాక్టరునకు కనిపించకుండులాగున యిద్దరకు మధ్య చెట్టొక టుండునట్లు చూచుకొని చాల నిశ్శబ్దముగా వెనుకకు ప్రాకు కొనుచు పోయినాడు.

ఢాం! హర్కారసింగు పేల్చినాడు. వానివిరోధి దాగి యున్న చెట్టుబెరడున కొకముక్క ఊడినది.

బర్వే పెద్దపెట్టున నవ్వుచు "అంత చచ్చుదెబ్బ కాదు గాని యది మీలో నెవరు కొట్టినారో నే నడుగ వచ్చునా" అన్నాడు.

"నీ వది త్వరగానే తెలిసికొనగలవు" అని యినస్పెక్ట రు గుర్రు మన్నాడు.

"ఏమి? అది నా రెండవ చిరకాలప్రియస్నేహితుడు యినస్పెక్టరు హర్కారసింగు గారా? ఎవరో ననుకున్నాను. నిజముగా నీప్రపంచ మెంత చిన్నదిగా నున్నది.! అయ్యో! బుద్ధిమంతుడా. దయయుంచి నీ వింటిదగ్గరనే చాల సురక్షిత ముగా పడియుండిన బాగుండిపోవును. లేనిపక్షమున నా కిష్ట ములేక పోయినను నీశరీరము తూట్లుపడులాగున కొట్టవలసి వచ్చును. ఆహా!"

అతడు గిర్రున వెనుకకు తిరిగినాడు. రెండుచేతులతో

ను పరిక్క నేదియో గట్టిగా పట్టుకున్నాడు. అంతలో పొదల లో నుండి మాటయొకటి ఆకస్మికముగా వెలువడినది. అతడు, ఆశ్చర్యార్థకమైన వెర్రికేకొకటి వేసి గిర్రున తిరిగి క్రింద పడి పోయినాడు. రామసింగు చాల మెలకువగా చుట్టుతిరిగి వచ్చి పిస్తోలు సిద్ధముగా పట్టుకొని ముందునకు వెళ్లెడి ప్రదేశమున కు వచ్చి చాల మృదువుగా "బర్వే! అంత గట్టిదెబ్బ తగిలిన దా యేమి? "అని యడిగినాడు.

డాక్టరు చాల నీరసముగా "ఆ. ఆలాగే నని యను మానము. తొడయెముక నలిగిపోయిన దనుకొందును. కాని జీవనాళము తగియుండదు. నాపుగనుండు చెట్టుకొమ్మొకటి తెచ్చి నాకాలు సాగదీసి కట్టుడు. నే నిక మీకు పలహారము ను కదా'' అన్నాడు.

ఇనస్పెక్టరంతలో రామసింగు చెంతకు పోయినాడు. అంతకాలమునుండి వానిని బంధించుటకును శిక్షింపజేయుటకు ను వారు చేయుచున్న ప్రయత్నము లన్నిటిని తిరస్కరించి తిరుగుచున్న యామానవు డిప్పుడు పూర్తిగా వారిచేతులలో చిక్కినాడు. వారిరువురును క్షణకాలమువానిని విస్మృతులై చూచినారు. వానిముఖము వెల్లనై యున్నది. అతడు యెడమ తొడ గట్టిగా పట్టుకొనియున్న వానిచేతిమీద రక్తము కను పించుచున్నది. అతడు మాత్రము వారివైపు కులాసగా చూచి నవ్వుచున్నాడు. ఇపుడు పూర్తిగా పరాజితుడుకదా!

అతడు ఊపిరి తీసికొని "ఏవిధమున నయినను నిదంత మంచిపని కాదు. ఏమందురు? మీరు కొంచెము రణధర్మము మాలోచించి యుండవలసినది. అంతేనా? సరే లెండు. నన్ను కొంచెము లేవతీసి నిలుపపెట్టుదురా? నా కీ స్థితి చాల బాధ కలిగించు చున్నది. మీరు సందేహించ నక్కర లేదు. నాపిస్తోలదిగో దూరమున గడ్డిమీద పడియున్నది. ఆ. అదే మంచిపని. హార్కూరసింగ్. ఆలాగున దూరముగా తన్ని వేయుము. అప్పుడు. ఎంత జాగ్రత్తగా నున్న నంత మంచిది" అన్నాడు. అతడు పడిపోయి యున్నను పిస్తోలు వాని సందుబాటులో నుండుట యిష్టములేక యినస్పెక్టరది కాలుకొలది దూరముగా తన్నివేసి కొంచెము క్షమాపణాపూర్వకముగా "మేము నీ విషయములో కొంచెముజాగ్రత్తగా నుండుట మంచిదికాదా!" అని తీవ్రముగా నని యతడు రామసింగు ప్రక్కను వంగి పడియున్న బర్వే చంకలలోనుండి చేయి పో నిచ్చినాడు.

వారు వానిశరీరము గాయపడిన వానికాలుతో సమానముగా నుండులాగున వానిని లేవతీయ ప్రయత్నించుటలో వారి యిరువురతలలును సుమారొకక్షణకాలము కలిసి యున్నవి. అంతలో నేదియొ చల్లని పదార్థము వారిముఖములకు చల్లినటుల తగిలినది. వారితలలు వెనుకకు వాలినవి. వారిగొంతుకలు నులిమి నట్లైనవి. వారు దగ్గి, దీర్ఘమైన నిట్టూర్పులు విడిచినారు. కండ్లు చీకట్లు కమ్మినవి. ఒకరిమీద నొకరు నిస్సత్తువగా దొర్లి కదలక మెదలక పడిపోయినారు.

బర్వే కిలకిల నవ్వుచు చాల సులువుగా లేచి, నిలచి కాలునకు గాయమైనచోట జేబురుమాలు చుట్టపెట్టి బిగించి దూరమునపడియున్న పిస్తోలు తిరిగి తెచ్చుకొని, జేబులోనుంచి చిన్న కాగితమొకటి తీసి దానిమీద తొందరగా నేదియొ గీలికి, రామసింగు ప్రక్కను పెట్టినాడు. తరువాత స్వల్పముగా కుంటుటకన్న వేరెక్కువ ప్రమాద మేదియు లేని లక్షణములతో నత. డావిశాలప్రదేశమును దాటి యాగాఢాంధకారమున కలిసి పోయినాడు. అప్పటికి చెరువు వెనుకనున్న యడవులలోనుంచి తొందరగా పరుగెత్తుకొని వచ్చుచున్న పదధ్వని వినుపించినది.

మరికొన్ని నిమిషములు గడచునప్పటికి రామసింగు తడబడుచు "ఏమి? ఆ! —ఉష్— అబ్బా నన్ను కుదుపకుడు. అబ్బా— దిక్కుమాలిన సన్యాసులు ... ... ... ... ..." అన్నాడు.

"అయ్యా! మీకు దెబ్బతగిలినదా? సంగ తేమండీ అసలు? మేము పిస్తోలుచప్పుడు విన్నాము. మీసెలవుప్రకారము వెంటనే లోపలకు దగ్గరగా మూసికొని వచ్చినాము"

రామసింగు ముఖమున నిప్పు డొక నమ్మకమైన వికాసము కనుపించినది. వచ్చిన మనుష్యులలో నొకడు వానిని కూర్చుండ పెట్టి పట్టుకున్నాడు. మరియిరువురు, అంతవరకు వానిప్రక్కను పడియున్న వారింమధికారికి స్మృతి కలిగించుటకై సమస్తోపచారములు చేయుచున్నారు. పరిమితి మీరిన వి

కారము వానికి కావలసినంత బాధ కలిగించు చున్నది.

అతడు తడుముకొనుచు "దాహము!" అన్నాడు.

మంచినీరు వచ్చినది. అతడు పూర్తిగా త్రాగినాడు గాని చాల జబ్బుస్థితిలో నున్నాడు. కొంతసేపటివరకు బరువుగా, ఆయాసముగా ఊపిరితీయుటతప్ప యితర దేదియు చేయలేక నిస్సత్తువగా పడిపోయినాడు. వానిస్థితి క్రమముగా త్రోవలోనికి వచ్చినది. చిట్టచివరకు రామసింగు మాటలాడుటకు చాలిన యూపిరి చేరినది.

"బర్వే వానికి ప్రమాదకరమైన గాయము తగిలినద నుకొన్నాను. వానికి సహాయము చేయుట — — — వాడొక మొండిజాతి విషద్రావకము మాముఖముల చల్లినాడు. ఊఁ- హుఁ— ఉస్సు — వాడు తప్పించుకొని — పారిపోయినాడా?"

"మే మిచ్చటకు వచ్చునప్పటికి వానిజాడయయినను మాకు కనుపించలేదు. కాని— ఇది మీాప్రక్కను దొరకినది. చిన్న చీటిముక్క—"

"చదువు. నేను చదువజాలను" అన్నాడు రామసింగు. ఆకాగితము వానికన్నులముందు క్రింద మీాదుగా తంద నాా లాడసాగినది.

"నీవే నన్ను ముట్టుకున్నావు. నేనప్పుడు పారిపోయి ప్రమాదము తెచ్చిపెట్టుకొన నిష్టములేక పోయినది. అయినను నా జాగ్రత్త మీాద నే నున్నాను. మిమ్ములనింత యాకస్మికముగా విడచి పోవలసి వచ్చినందులకు విచారముగా నున్నది

క్షమించుడు. త్వరలోనే తిరుబడిగా మరి త్రము వ్రాయుదును. అంతే పం డయ్యా" అన్నాడు.

"అయిన కాలము వృథ పుచ్చకుండ విూలో నొకరు మాత్రి మిక్కడ నుండుడు. మిగిలినవారు చేరువనున్న జైలి పోను దగ్గరకు పోయి ప్రతివానిని లేపి వేయుడు. అతడు బహుశా వానిమోటారులాంచిమీాద పోవ్ను ననుకొందును. కాని మీారు చురుకుగా పనిచేసినయెడల నతడు రేవులు దాటిపోవులోపల పట్టుబడు నవకాశ ముండును. ఊఁ. త్వరగా"

ఇరువురు మనుష్యులు తొందరగా పరుగెత్తుకొని పోయినారు. రామసింగు దగ్గరకు వ్రాకినాడు.

అతడు నెమ్మదిగా "అబ్బాయి! చివర నితడు మనకు చాలమంది పెట్టయినాడు. మనలను మరియొకసారి తప్పించుకొని పోయినా డేమో నని నాయనుమానము. నీ కేలాగున నున్నది బాధ" అని యడిగినాడు.

హార్కారసింగు మ్లూలుగుచు, "అబ్బా! నా కసలు స్మారకమే లేకపోయిన బాగుండులాగున కనుపించుచున్నది. నన్నంతగా బాధ పెట్టకు. నేను చచ్చిపోవుచున్నా ననుకొందును. న న్నీలాగున విడిచివేయుము ఒంటరిగా!" అని పడిపోయినాడు.

"నాసంగతీ, అంతే" అని రామసింగు నసికి ప్రపంచముమీాద మరిదేనితోడను సంబంధము కలుగజేసికొని బాధ తెచ్చిపెట్టుకొన నిష్టములేని వానిలాగున ప్రక్కకు వాలి పరున్నాడు.

మరుచటినాటి మధ్యాహ్నము కొంత గడచినతరువాత నాస్నేహితు లిరువురును, ప్రసిద్ధిచెందిన యొక హోటలు వెనుక యానరణలోని పూలమొక్కలమధ్య చెరియొక పడకకు ర్చీలోను పరున్నారు. రాత్రియాతయు బాధపడి వా రప్పుడే కొంచెము తొలివలోనికి వచ్చుచున్నారు. ఓడలరేవులో క్రింద కు మీదకు కావలసినన్ని పరుగులు, పంచెములు జరిగినవికాని బర్వేలాంచి మాత్ర మొక్కడను కనుపించలేదు. అది పూర్తి గా యదృశ్యమయినట్లు ల కనుపించినది.

హార్కరసింగు చాల యస్పష్టముగా "దానికేమి? వాడొక్కడునో యొకచోట చచ్చును. అవకాశము దొరకినప్పుడు మాత్రము వానిపొట్ట పిస్తోలుగుండ్లతో నింపి తగినంత జాగ్రత్త పుచ్చుకొని యుండకపోవుట యొంతపొరపాటు మనది!" అని గొణిగినాడు.

దురదృష్టవశమున మనయిరువురలో నొకడుకూడ నా రకములోని వారము కామయితిమి. ఆసంగతి వా డెరిగి యుండియే మనలను లోకువ చేసినాడు. ఏది యెటు లున్నను మనము వానిని నిందించ నవకాశము లే దని నాయభిప్రాయ ము" అని సమాధానము చెప్పినాడు.

"అవకాశము లేదుగాని యెప్పటికైన నా కవకాశము దొరకితేమాత్రము వానిపీక నులిమి వేయకుండ నూరకొనను" అని యినస్పెక్టరు క్రోధమున మండిపడుచు పండ్లు పటపట కొరికినాడు.

ఆక్షణముననే 'టెలిగ్రాపు' కురర్రీ డాకటెలిగ్రాముమును అంతకు పూర్వమే వచ్చిన యొక యుత్తరము చేత పట్టుకొని వారిదగ్గరకు వచ్చినాడు.

రామసింగు చేయి చాపి టెలిగ్రా మందుకొని "హ ర్కారు. ఇది నీకు– ఇంటిలో నే మున్నదో" అన్నాడు.

"లాంచి గుజరాతుదగ్గర సముద్రపువారను పడయి పడియున్నది. కళాసుల యానుపాను తెలిసినది కాదు." అని చదివి యిన్స్పెక్టరు "సరే. దానిసంగ తింతటితో సరి. దాని సంగతేమి నీచేతిలోని దిది?" అని యడిగినాడు.

బల్వే వాగ్దానముచేసిన యుత్తరము. బొంబాయి పోస్టుముద్రయే యున్నది. ఈవేళ ప్రొద్దుట టపాలోనే పడినది. ఇదీ, సంగతి.

"ప్రియమైన రామసింగు!

నీవును, మనప్రియస్నేహితుడు హర్కారసింగును చాలగ బాధపడియుండుట వాస్తవమే. అం తవరకు చేయవలసి వచ్చినందుకు నాకు చాల విచారముగా నున్నది. తప్పదు. జయాభిలాషకొలది, కార్యావసరమును బట్టి ప్రతికక్షులపై యప్పు డప్పు డట్టివి ప్రయోగించవలసి వచ్చు చుండును. అంతే. మిగత సంగతిని గూర్చి విచారించకుడు. త రువాత – నే నిక ముందు మీారు సంరక్షణలో పెట్టుకున్న యాచిన్నవానిని వెంటాడుట పూర్తిగా వదులుకున్నాను. నీ

మూలమున నది చాల కష్టతరముగా న్యమయినది. ఎంతమాత్ర
మును కట్టుబడి యగుట మానివేసినది. నేను నావిషయము
లో స్వతంత్రుడుగా ప్రవర్తించలేనని చెప్పగలను. నాకొత్తా
దారు నాసలహామీద కొన్ని పనికిమాలినవ్యాపారములలో
పెట్టుబడి పెట్టిన సొమ్ములు, యిప్పుడు ప్రస్తుతము మంచినమ్మ
కమైన యొక మధ్యవర్తిద్వారా నాస్వాధీనముననే యున్నవి.
అవి వానికే విడిచి వేసినాను. అత దంతి సరసునిలాగున కను
పించడు. నే నింతవరకు చెప్పుట యనవసరముగాని, యయిన
ను తగినంతజాగ్రత్తమీద నుండుడు. మొండికెత్తిన సన్యాసి
తో వ్యాపార మెప్పుడును ప్రమాదకరమే గదా! నేను ప్ర
స్తుతము బర్మాలో కొంతవ్యాపార ముండి పోవుచున్నాను.
కొంతకాలమువరకు మీకు కనుపించను. మీకును, మనప్రి
య స్నేహితుడు హార్కారసింగునకును, హృదయపూర్వకమైన
నమస్కారములతో, ప్రస్తుతము సెలవు పొందుచు నభిలాషపడు
ప్రియమైనప్రతికక్షి.

కర్ణా బర్వే"

అని చదివి "వానియురత్నములలోని యొక ప్రశస్తమ
యిన నమూనా యిది. హార్కారు ఏమందువు?"

హార్కారసింగు మందముగా నవ్వినాడు.

"అత డెప్పు డిదే రకపుమొండితనము. ఏదీ? ఆయుత్త
రము నాదగ్గర నుంచు. మాసూపరింటెండెంటుగా రది చూ

చి చాలగ నానందించెదరు. ఇక నేను శోకకాళ్ళసందున నిరీ కించుకొని, మాసూపరింటెండెంటుగారిదగ్గరకు పోయి మరియొ కసారి యపజయము పొందితి నని చచ్చుమొఖము వేసికొని చెప్పవలయును గాబోలును. నాప్రకరీలో నే నిదివరకు యి తర నేరములలో మంచిపేరు సంపాదించియుండకపోయిన పక్షమున, నిది యపమానకరముగ, నేకటికి చీకటిలోనో నామీందపడి నా కొంప తీసియుండును గదా! ఇక ముందు నేను నీకోసము హ ర్నాజీమీంద నిగా యుంచెదను" అన్నాడు యినస్పెక్టరు.

అంతట రామసింగు "నీకు చాల వందనములు. నిజము చెప్పవలసివచ్చిన నాయంతట నే నే కొలదిరోజులలో వాని మీంద నిగాయుంచుదు నని నానమ్మకము. అప్పుడు వాని యి రకతరకల వ్యాపారమునుగూర్చి నీవు పూర్తిగా తెలిసికొ నుటకు సిద్ధపడియుండుము. ఇది నీ వనుకొనుదానికన్న నెక్కు వ వికారముగా నున్నది" అని చెప్పినాడు.

హర్నాకరిసింగు వెడలిపోయినాడు. మరికొంచెము సేపటిలో రామసింగు గాఢమైన కాఫీ త్రాగి కొంచెము సత్తువ తెచ్చికున్నాడుగాని యింకను దప్పి వదలలేదు. నెమ్మదిగా బయలుదేరి యొకరోజు యెడబాటు తరువాత తుకారామును, ఫిరోజును కలిసికున్నాడు. తుకారా మంతవరకు ఫిరోజును, యడవికాపురమునకును, యచ్చట పరిస్థితులకును యలవాటు పడుటకు కావలసిన పద్ధతులు నేర్పినాడు.

రామసింగు "ఫిరోజు! నీవ్యాపారము నీవు రేపే

ప్రారంభించవలయును. నే నీలోపున నా ప్రదేశము మరియొక సారి సాంతముగా చూచినగాని తృప్తి కలుగదు. కాని నీ కాయనస్థ మన మనుకొనినంత యెక్కువకాలము పట్టదను కొనియెదను. అనగా నది యెన్న దనుకొను నిలాగున క్రొత్త త్రోవను బడి హఠాత్తుగా మునిగిపోవు నని నాయనుమానము. ఊఁ. ఊఁ. ఈప్రశ్న లెంతమాత్రము పనికిరావు. ఈరాత్రి త్వరగా పోయి పరుండుము. రేపు నావెంట బందులుదేరు నప్పటివరకును నీ పీసారాటలు విడచి యెక్కడికిని కదల కూడదు. తెలిసినదా? సరే యిక" అన్నాడు.

తుకారాం మాత్రముగా నస్తు వచ్చి "అయ్యా! తమ రిప్పుడే యొంటరిగా పోవుటకు తగినస్థితిలో నున్నదా తమ దేహస్థితి?" అని యడిగినాడు.

"ఆహా! తుకారాము! నేను చేయవలసిన పని చేయుటకు తగినస్థితిలోనే యున్నది. దేహస్థితి కేమి లే." అని సమాధానము చెప్పి మందహాసము చేయుచు వెడలిపోయినాడు.

౨౬

రామసింగు హోటలు విడచి మరియొకసారి బైసికి లెక్కి, క్రిందటిరాత్రి బర్వేను కలిసికొనిన చోటకు పోయి నాడు. అతడు చెరువు సమీపించు నప్పటికి వెలుతురు పూర్తి

గా పోవుచున్నది. అక్కడ గడ్డిమీద రక్తపుమరకలు కొన్ని యింకను కనుపించుచున్న యాప్రదేశ మత డొకసారి కన్నెత్తియైనను చూడలేదు. చుట్టునున్న చెట్ల వరుసలో చాటేలున దూరి యవతలనున్న యిల్లు సమీపించినాడు.

అంత నిర్దాక్షిణ్యముగా నిరాదరణముగా చూడబడు చున్న యాయింటి లక్షణము లంత చీకటిలో నయినను స్పష్ట ముగా కనుపించు చున్నవి. ఇంటిమీద పెంకులు లేక కొన్ని చోట్ల కాళీలు కనుపించుచున్నవి. ఒకటి రెండుచోట్ల చూరులు దిగబడిపోయినవి. వంటశాలను, గుర్రపుశాలను మరుగు పుచ్చుచు యింటిచుట్టును పొడుగుగా నున్న యావరణగోడ మీఁది కప్పురాళ్లు పగయిరాలు నాచుమొదలయినవి చేయ గలిగినంత దుర్మార్గమునకు గురియై జాలి గొలుపుచున్నవి.

ఆవరణగోడ, ఆలాగున పొడుగునను పోయి దట్టము గా నున్న యొక డొంకతో కలసిపోయినది. రామసింగు దీని వార నంతవరకు పోయి చూచి అక్కడ పైకి లేచి యితరు లకు కనుపించకుండ జాగ్రత్తగా గోడ యెక్కి, లోపల నదివరకున్న పూలతోటను దానివైభవమును నణగద్రొక్కిన చెత్త, ముండ్లపొదల మధ్యకు, లేశమైన చప్పుడు లేకుండ దుమికినాడు.

అక్కడ నవనవలాడుచు మంచిపూల నొసంగుచుపద్ధతి ప్రకారము కత్తిరించి యుంచబడు పూలమొక్కల వరుసల కు మారుగా నడవిమొక్కలును, ముండ్లడొంకలును, బయలు

దేరి యున్నందున నక్కడ క్షణ మాగి సేట్ సీతారామరత్నా జీ తనయొక్కఅంతస్తు ఆవిధముగ నిరాదరణగా విడిచి వేసినందున కతడు బాత్తిగా మతిలేని ముండకొడుకని దూషించ ప్రారంభించినాడు. తరువాత పొడుగుగా దట్టముగా పూపొదలు మొలచిన ఒకయొక తోటవెంబడి నక్కుచు ముందుకు పోయి యింటి వెనకవైపుననున్న కంచెలోని కాలిబాటనుండి రహస్యముగా లోపలకు దొంగి ప్రవేశించినాడు.

క్రిందివరుస కిటికీలలో నొకదానినుండి మందముగా వెలుతురు కనుపించుచున్నది. రామసింగు సాభిప్రాయముగా తలయూడించినాడు. అత డదివరలో పిన్న బంగళాకాపరి యైయుండి యుండును. ఆదీపము వానిదే. అత డొక పనికి మాలిన పసువుముండకొడుకని వాడుక. చిరచిరలాడు స్వభావము కలవాడు. వాని పేరు జబారు.

జబారు ముసలివర్తకుని నౌకరిలో చాలకాలముగా నున్నాడు. అదివర కొక సారి, ఆయింటిలోని సామాను దొంగిలించి యమ్ముకొని నందులకు కొంచెము కారాగారవాస మనుభవించిన వాడే. ఆవిధముగా స్వామిద్రోహ మొనరించిన తరువాత సర్వసాధారణముగా నేయజమానియైనను నవుకరును సాగనంపి తల తడుముకొనియే యుండును. కాని రత్నాజీ మాత్రము వానిని క్షమించి వాని యెప్పటిపని వానికిచ్చి వేసినాడు.

మానవహృదయములోని సౌకుమార్య మూర్ధనమునకు గురియై యత డాలాగున దయదలచి యుండుట స్వభావసిద్ధ

మే కాని జబారు మాత్రము ముసలివాని మెత్తదనమునకు వానిని జన్మాంతమువరకు దూషించుచునే యున్నాడు.

"ఆహా! ఈవిపరీతము ........" అనుకొనుచు రామసింగు హఠాత్తుగా నాగిపోయినాడు. ఏలనన ఆలోపల దీపమున కష్టగా సగమునిటు తిరుగుచున్న కిటికీసందునుండి మానవాకృతి యొకటి వానికి కనుపించినది.

అతడు దానికి కొంచెము దగ్గరగా జరిగినాడు. అదృష్టము బాగుండి, వాని నల్లరిచేసి కార్యభంగ మొనర్చుట కకూడ కుక్కమాత్రము లేదు. అందుచేత రామసింగు మరియు ము[illegible] జరిగి, పొత్తుతక్కువ రాతిపట్టా యొకటి దాటి, జబారున కనుమానము కలిగించకుండ నిశ్శబ్దముగా కిటికీదగ్గరకు పోయినాడు.

కిటికీవెలుపల పూలతీగ లలుముకొని యున్నవి. రామసింగాయున శాఖము దొరకపుచ్చుకొని, జబారు మామూలు ధోరణిగా కిటికీవైపు చూచినను వానికి కనుపించుప్రమాదము లేకుండగనే తిన్నగా కిటికీలోనుండి లోపలకు చూడ గలిగినాడు.

ఆగది మొట్టమొదట నొక వంటగదిగా పుట్టియుండును. కాని యిప్పుడు వంటగదిగను సామానుగదిగను పడకగదిగను, కూడ నుపయోగ పడుచున్నటుల కనుపించినది. జబారక్కడొక్కడే యున్నందున యజమానితాలూకు సామాను యేది కావలసిన నది స్వేచ్ఛగా యుపయోగించు కొ

నుచున్నాడు. మీదయద్దమున్న మంచియందమైన విరుగుడుచే
వ సొరుగులబల్ల యున్నది. దానికి మరియొకప్రక్క మంచి
కంపెనీ ముద్రలనుంచబడియున్న సీసాలున్న రెండుమూడు నిలువు
కుర్చీలును రెండు బిస్తరుగ, సుఖాసనకుర్చీలును ఉన్నవి. ఇం
త యందమైన సామానును చాలవరకు మంచి యుపయోగము
లో లేవని చెప్పుట తప్పు కాదు.

వంటగదినైపున మాసినగుడ్డలును, అల్లరి చిల్లరగా ప
డియున్న మసిబారిన వంటసామానును, కొన్నిదినములనుండి
తుడుపునకు మొగమువాచియున్న నేలయును చాల నేహ్యముగా
కనుపించినవి.

మొదటినుండియు గౌరవముగా బ్రతికిన నాసొరుగుల
బల్లమీద సగము ఖర్చుపడిన సారాసీసాయును, ప్రక్కను చి
న్న పింగాణీకూజాతో నీళ్లును, ఒక గాజుగ్లాసును ఉన్నవి.

అంతయు నేహ్యముగా నుండుటతోపాటు దానిలో
బుద్ధిమంతుడు కూడ నింతకు తేసిపోవకుండగనే యున్నాడు.
అత డొకవారనున్న స్ట్రౌవ్వు వెలిగించి మీద కాలిన పెన
ములో నేదియో వేయించుచున్నాడు. రామసింగు కనిపెట్టి
చూచుచుండగనే యతడాపని ముగింపుచేసి పెనము క్రిందకు
దింపి, అందులోని సరు కొక విలువగల పళ్లెములో తిరుగవేసి
ప్రక్కను గోడలో నున్న యలమారు తెరచి దానిలోనుండి
యందమైన విలువగల కప్పుసాసరు తీసి, బల్లమీద నుంచినా
డు. అతడు మంచిగాటయిన సారాయికొంత పొరపాటున నయి

నను నీరు కలవకుండగనే ఒకగ్లాసులో పోసి, కొంచెము వేపిన దానిలో నంజుకొనుచు ఫలహార మారంభించినాడు.

రామసింగంత మాత్రము నుకదల లేదు. అనేకు కొంతకంగారు పడినటుల ముఖము చిట్లించి ముడిచినాడు. కాని జబారును కనిపెట్టి చూచుచునే యున్నాడు. అతడవసరమునుబట్టి యేలాగయినను యింట ప్రవేశించ స్థిరపరచుకున్నాడు. కాని జబారు కునికిపాట్లతో శరీరము తెలియకుండ పడిపోవునరకును కనిపెట్టుకొని యుండుట మంచి దనుకున్నాడు. అతడు గాటయిన యూసారా యారీతిగా పీల్చుచుండినచో రామసింగు ఆ పలకు పోవుట కంతయెక్కువకాలము నిరీక్షించియుండ నక్కరలేదు. ఏమన జబారిప్పుడు మాయు చేయుచున్నది మూడవ గ్లాసెడుసరుకు.

అతడంత యెక్కువగా మితిమీరిన పనిచేయుట మంచిది కాదని వానికే తోచినటుల కనుపించినది. అందుచేత నా వ్యాపారము కట్టిపెట్టి, చాల యాత్మగౌరవము కలవానిలాగున దర్జాగా లేచి, సరుకు చాలవరకు ఖర్చుపడిపోయిన యూసీసాయును మిగతసామానును తీసి, గోడలలోని యలమారులో నుంచి, తలుపు చేరవేసినాడు. తరువాత బల్లలోని సొరుగొకటి తెరచి అందుండి మాసిన పాతవార్తాపత్రికలో చుట్టపెట్టియున్న బగీ యొకటి వెలుపలకు తీసి బల్లమీద నుంచినాడు.

బల్లమీద నున్నదీపము పెద్దదై పొగవచ్చుచున్నది

న కొంచెము క్రిందకు దింపి బంగీ విప్పినాడు. రామసింగు బయటపడనున్న యాశ్చర్యార్థకపు కేక నొకదాని బలవంతముగా నాపుకున్నాడు. ఆబంగీ యంతయు బేంకునోట్లు - నూరు రూపాయీలవి. జబారు దాని జూచి యానందాతిశయమున నొగిరి యెగిరి పడుచున్నాడు. నోట్లను పట్టి బుజ్జగించి అది యొక ప్రియతమమైన చంటిపిల్లలాగున నెత్తి బుగ్గకు చేర్చుకొని యువ్విళ్లూరుచు యానందించినాడు. తరువాత యంత డ వన్నియు బల్లమీద పరచి లెక్కించ ప్రారంభించినాడు.

రామసింగుకూడ నాలెక్కవెంట పడినాడు. సరిగా నూరు లెక్కపెట్టినాడు. పదివేలరూపాయీలు! అంతసొమ్ము జబారువంటివాని స్వాధీనములోనికి న్యాయమార్గమున వచ్చి యుండ దనుటకు సాక్ష్యమెంతమాత్రము నవసర ముండదు.

రామసింగు గుమ్మమువైపు పోవుటకు ముందడుగు వేయబోయినాడు కాని వెంటనే యుపసంహరించుకున్నాడు.

“దీనికి కొంచె మూహ కావలసినదే. కథయింకను పక్వదశకు రాలేదు. నేను చేయకపోయిననే బాగుండులాగున నున్నది. వ్యవహారము దానంతటది స్వభావసిద్ధముగా పరిపక్వదశకు వచ్చువరదాక నిరీక్షించియుండుటయే ప్రశస్తము” అనుకున్నాడు.

అతడు చురుకుగా గిర్రున వెనుకకు తిరిగినాడు. ఏలన న యినుపతలుపు తెరచిన కిర కిర శబ్దము, కొంచెము దూర

ముస మానవపదధ్వని చాల మందముగా యస్పష్టముగా విన వచ్చినది. అతడు దట్టముగా నున్న యాయింటికిటికీనీడలోనికి త ప్పుకొని, శ్రద్ధగా వినుచు నక్కడనే నిలచినాడు.

ఆ యింటికి కుడివైపుగా చుట్టివచ్చి వీధిగుమ్మముదగ్గర కు పోవుబాటలో దొంగతనముగా నడచిన పదధ్వని వినుపిం చులోపున కొన్ని నిమిషములు గడచిపోయినవి. మనిషి గు కిటికీలోనుండి తొంగిచూచినాడు. జబారున కేదియు వినుపిం చలేదు. అత డెప్పటిలాగునె బల్లదగ్గర నిలచి తనధనలక్ష్మిని మరియొకసారి లెక్కపెట్టుచున్నాడు.

పదధ్వని క్రమముగా యింటివీధిగుమ్మమువైపు పోయి నది. వెంటనే వీధితలుపు తట్టినధ్వని యొకటి హఠాత్తుగా విను పించినది. అది నిర్మలముగా నున్న యారాత్రి పెద్ద పిడుగుపా టులాగున ప్రతిధ్వనించినది. జబారు తుళ్ళిపడి కంగారుగా లేచి, నోట్లన్నియు చుట్టబెట్టి కోటులోపలి పైజేబులోనికి దూర్చి కంగారుగా బల్లదగ్గరకు పరుగెత్తి అందున్నవి తిరుగ అదివరకటితీసిన సొరుగులో జాగ్రత్తగా నుంచి, సొరుగుతా ళము వేసి తాళము జేబులో జాగ్రత్త పెట్టి మూలకు జారవేసి యున్న పొడుగుపాటి తుపాకి యందుకున్నాడు.

తలుపు కొట్టినవాడాలాగుననే మరియొకసారి కొట్టినా డు. జబారు తుపాకి మంచిస్థితిలో నున్నదని స్థిరపరచుకొని సగర్వముగా క్షణకాలము నిలచి తరువాత తలుపువైపుగా క దిలి పోయినాడు. అతడు మరియొక నిమిషము వణుకుచు ద్వా

డ్డిలోనికి వచ్చునప్పటికి రామసింగు మరియు దట్టముగానున్న చీకటిలో మరుగుపడ నాబోయెను.

అతడు యింటిచుట్టు తిరిగి వచ్చినాడు. రామసింగు అడుగులో నడుగువేయుచు వానివెంట పడినాడు. పీఠశాలపు దగ్గరనున్న యూయాంగింతుకుడు మరియొకసారి గంభీరముగా నవలించిన ధ్వని వినుపించునంతలో జబారక్కడనే నిలచి పోయినాడు.

అతడు తుపాకి యెత్తి సిద్ధముగా పట్టుకొని మండిపడుచు చాల తీవ్రముగా "ఎవరు నీవు? నాదగ్గర మాత్రము వెర్రివేషములు వేయకు తుక్కుక్రింద గొట్టివేయగలను ముగమోటము లేకుండ జాగ్రత్త" అని గర్జించినాడు.

"ఉష్! బుద్ధిమాలిన చవటలాగున ప్రవర్తించకు. అంత నోరు చేసెదవేమి అనవసరముగా" అని యొకధ్వని గుసగుస లాడినది.

క్రీనీడలో నున్న రామసింగు కృతజ్ఞత వెల్లడించుచు, కొంటి నవ్వొకటి నవ్వినాడు.

సంగతిచూడగ పరిస్థితులు వాని కనుకూలముగ మారుచున్నటుల కనుపించినవి. ఏమన ఆకంఠస్వరము హార్త్రాజీది.

అది జబారును నిశ్చేష్టుని చేసినది. అతడు సిగ్గుపడి తుపాకి క్రిందకు దింపి, తిరిగి భుజమున కెత్తి పట్టుకున్నాడు.

హృదయమున లేనియభిమానమును పైకి నటించుచు కృత్రిమస్వరమున "హార్త్రాజీ బాబుగారు! తమ కేమి కావలయు నిప్పుడిక్కడ? నేను నాపనంతయు పూర్తి చేసు కొని, నిదుర

పోవుటకు సిద్ధపడుచున్న యీయర్ధరాత్రిసమయమున తమరు వచ్చి నాకు యిబ్బంది కలుగచేయ వలసినంత తొందరపని యేమి వచ్చినది?" అని యడిగినాడు.

హార్డాజీ పడేలున "ఏడ్చినట్లే యున్నది. నాప్రే రందరు వినలాగున నంతపెద్దగొంతుక పెట్టుకొని యారవకు. నీతో కొంత మాటలాడ వలసిన పని యుండి వచ్చినాను. అది చాల యవసరమైన సంగతై యుండును దానిలో నీకపరిమిత మైన డబ్బుకూడ కలిసి రావచ్చును. ఏమి! క్రోధ పడినదా? సరే. మన మిప్పు డానంగతి యెచ్చట కూర్చుని మాట లాడుదము? రహస్యముగా?" అన్నాడు.

జబారు సమాధాన మొసగుటకు పూర్వ మొక నిమిషము కన్న నెక్కువసేపు తటపటా యించినాడు.

అతడు "నీ వెంతమాత్రమును సందడి చేయనని మా ట యిచ్చి వెళ్లినావు. రాత్రి యెవరో యీయడవిలో ప్రవే శించినారు. తుపాకులు చప్పుడు పరుగెత్తుట వెంటపడుట మొదలయినవి చాల జరిగినవి. నాకు భయము వేసి చాల కంగారుపడినాను. ఎవరు వచ్చినను సరే యని నే నీలాగున నే తుపాకి పట్టుకొని సిద్ధముగా నున్నాను" అని పలుకుచు నత డాతుపాకి నాళముచివర సరిగా హార్డాజీ గుండెలునకు తగులునటుల పట్టి చూపినాడు. హార్డాజీ కంగారుపడి కెవ్వున కేకవేసి యొకతిట్టుతో చెంగున ప్రక్కకు గెంతినాడు.

"అంతపనిమాత్రము చేయకు మతిమాలిన ముండ కొడుకా! కమానుజారి కొంప మునుగగలదు." అని క్రూర

ముగా కసరినాడు. జబారు చిరునవ్వుతో "ఆ. అది జారను నేను చెప్పినప్పుడు తప్ప. అప్పుడు మాత్రము తప్పకుండ చూ పగలదు. సరే. నీవు సరాసరి లోపలకురా యీత్రోవను. ఆ తలుపు తీయుటకు వీలు లేదు. ఆతుంటరు లెవరైన లోపలకు రాగలరు" అన్నాడు.

రామసింగు వెనుకకు పోయి యావైపుననున్న వంట వసారా గుమ్మములోనుండి నిశ్శబ్దముగా లోపల దూరి, య క్కడనుండి ముందునున్న గాఢాంధకారములోనికి బాటకసవే ళ్ళమీాద నిశ్శబ్దముగా నడచిపోయినాడు. ఏమి వచ్చినను సరే యతడు హర్నాజీ నోటినుండి వెలువడుమాటలు విని తీరవల యును.

అతడు లోపల ప్రవేశించియు ప్రవేశించునంతలో నా జంటకూడ లోపల ప్రవేశించినటుల వినుపించినది. వెలుపల తలుపు మూసివేసి జాగ్రత్తగా గడియవెట్టి, లోపలతలుపు స్వల్పముగా తెరచి యుంచి యాబుద్ధిమంతు లిద్దరును లోపల ప్రవేశించినారు.

"నీవు యొంటరిగనే యున్నావుగదా?" అని హర్నాజీ మాత్రిముగా ప్రశ్నించినాడు.

"ఆహా! కచ్చితముగా! అంతకన్న నిక్కమైన నెన రుండు కనుకొనియెదవు.? నే నెవరయిన యాండుదా నిని తెచ్చిపెట్టి కొనెద ననియెదవా?"

"ఏమయినను సరే. కిటికీకి ముసుగు వేయుము. ఇక్క

డకు వచ్చువా రెవరు నుండరుగాని యయినను, నేను తగినంత జాగ్రత్తగా నుండుట యవసరము. నే నిక్కడ నున్నట్టుల యెవరికిని యెంతమాత్రమును తెలియకూడదు. తెలిసినదా?"

"ఇక్కడెవరు నుండరు అప్పు డప్పుడు గస్తీతిరుగున పుకరు తప్ప. అత డిట్టి సువార్త నలుగురకును వెల్లడిచేయునా? సరే. నేను తలుపులన్నియు వేసి తగిన జాగ్రత్తమీదనే ఉన్నానుకదా! నీ వీయింటి కప్పుమీదకు పోయి బిగ్గరగా నరచినతప్ప ని న్నొకడు చూడజాలడు. వినజాలడు. అవునా. సరే. నీవు న న్నింత యాపేక్షముగా చూడవచ్చిన సంగతే మో చెప్పు." అన్నాడు.

30

హర్తాజీ గది నలుప్రక్కల కన్నులు త్రిప్పి చూచినాడు. పాడుపడుచున్న సామాను వానికంట బడినది. అతడు క్రోధమును కప్పి పుచ్చు వికారపు నవ్వొకటి నవ్వినాడు. కిటికీసందునుండి రెప్పవాల్చక దీక్షగా చూచుచున్న రామసింగు నకతడు, ముందునకు యెరమీదకు దుముక సిద్ధముగానున్న క్రూరజాతి చిందుగులాగున కనుపించినాడు.

హర్తాజీ "నీవు చాల యందమైన కాపలామనుష్యుడవని చెప్పక తీరదు. సరే. ప్రస్తుత మాసంగతి మన కవసరము లేదు. కాని కొన్ని యపసవ్యపుసంగతులు తటస్థించిన పక్షము

న నీవు నివసించుటకును చిత్తము వచ్చినటుల తగుల వేయుట కును ఈయిల్లు లేకుండపోయి వీధులలో చెట్లక్రింద కాపురము చేయవలసి వచ్చును''

"ఎవరిని గూర్చి యీమాటలు" అని జబా రడిగి నాడు.

"నాయభిప్రాయ మేమన మావాడు ముసలాయనవీలు ప్రకార మందులోని కొన్నిషరతులు నెరవేర్చినయెడల ముస లాయన యాస్తియు వానికి సంక్రమించును. దానికి తగి నన్ని యాటంకములు కలుగచేయువారు లేకపోయిన పక్షమును సులువుగా నెరవేర్చుకొని యతడే యజమాని యగును. ఆ! నీ వనిన వాని కెంతమాత్రమును కిట్టదు. అంతవరకును నాకు బాగుగా తెలియును''

"అతడా! ఆమునికిపాట్ల కుర్రసన్యాసి! ఆ! అతడా! ముసలివాని యాస్తికి హక్కుదా రగుట? ఒకసారి కుర్చీలో పరుండి కునికిపాట్లు పడుచుంటినని నాకు మొఖమున బొట్లు పెట్టిన యతడా?'' అని జబారు యుద్రేకముగా కేకలు వేయు చు క్రోధ మణచుకొనలేక చిందులు త్రొక్క సాగినాడు.

"కానీ——నే నావీలు యేలాగునసని జరుగు నని సందేహించి..........."

అనుచు నతడు రేదియో యాలోచన గొంతుక కడ్డు పడినటులుగ హఠాత్తుగా నాగి క్షణకాలము తటపటాయించి తిరిగి ప్రారంభించి "దురదృష్టవశమున నావీలు చెల్లును. ఆవీలు

లోని మూడునిబంధనలలో ఫిరో జిదివరకే రెండు కొనసాగించుకొని వచ్చినాడు. మూడవ దేదియన యతడు యితరుల యిండ్లకు పోకుండ, యితరులనుంచి యేవిధమైన సహాయమపేక్షించకుండ యీయడవులో మూడువారములు కాపురము చేయవలయును. అతడక్కడ వానికి దొరికిన దేదియొ లాని, యే చెట్టుచాటుననో చేతనయిన గూడొకటి నిర్మించుకొని తల దాచుకొన వలయును. ఆలాగున మూడువారములు గడపగలిగినచో ముసలివాని యాస్తి యావత్తును వానికి చెందును. నాకేమియు దక్కదు కాని, యతడు నెరవేర్చ లేకపోయినచో" అని వాని యాఖరుమాటలలోని యభిప్రాయము రెండవవానికి పూర్తిగా యవగాహన యగుట కతడు, అక్కడ క్షణమాగి, తిరిగి ప్రారంభించి "అతడు నెరవేర్చలేక పోయిన నాయాస్తి యంతయు నాకు చెందును. నేను వానికిన్ని చాల సరసమైన యజమానినని బుజువు పరచుటకు నాకు చాల సరదాగా నున్నది" అన్నాడు.

జబారు వికటముగా "నీవంటివానిని నే నింతవరకెక్కడను చూడలేదు. పెద్దవాడు కానిమ్ము, చిన్నవాడు కానిమ్ము నీవలన నెవ్వడును ఎన్నడును నొకదమ్మిడియైన పుచ్చుకొనినటుల కనుపించదు. కాని నే నొకసారి చాల బాధపడి నిన్నడిగినప్పుడు, నీవు రూపాయి మార్చి అందు దుకాణాదారు తిరిగి పుచ్చుకొననని తిరస్కరించిన ముద్దజబ్బుమాత్రము నాకిచ్చినావు" అన్నాడు.

హర్త్రాజీ చురుకుగా ఓహాఁ! అది చాలకాలమునాటి కథ. సరిగా దనే నాయభిప్రాయము. సరే దాని కేమి? ప్రస్తుతము నీకు కొంతవరకు యిచ్చుటకే నేను వచ్చినది" అన్నాడు.

"ఎంతవరకు?" అని జబా రాత్రిముగా నడిగినాడు.

"అయిదువంద లనిన నే మందువు? ఇదిగో!" అని హర్త్రాజీ నోట్లుతీసి తనచేతిలో నదిదినాడు.

అంతకు క్షణకాలమునకు పూ దానికి యేబదిరెట్లసొమ్ము చేతులలో నలిగియుండుటచే వాని కాహర్త్రాజీ చేతిలోని నోట్లంత గొప్పగా కనుపించలేదు.

"నేను నీకోస మేమి చేయవలయునో యింకను చెప్పితివికావు. ఏమియు చెప్పకుండ నీవు ముందు సొమ్మిచ్చి నన్ను మోసగింప ప్రయత్నించుట మంచిపని కాదు నీవంటివానికి" అన్నాడు జబారు.

"ఇది ఊరికే బజానా వంటిది. నీకు నాయెడల నమ్మకము కలిగించుటకు నీవు నాకు కావలసినది నెరవేర్చిన తరువాత దీనికి పదిరెట్లు ముట్టచెప్ప గలను" అని హర్త్రాజీ బేరము చెప్పినాడు.

"సరే. ఇప్పుడు మీమాటలు బుద్ధిగలిగి యున్నవి. పద్ధతిప్రకార మున్నవి. అయ్యగారూ! ఈ మీసొమ్మునకు మీకు నే నేమి చేయవలయును బాబూ?" అని నమ్రతగా నడిగినాడు.

హర్త్రాజీ యిప్పటికి గాబరా తీరి చాలవరకు సవ్యమైన స్థితిలో పడి "నీకు బోధ పడ లేదా? సరే వినుము. ఈయడవిలో గడప వలసిన మూడువారములును మొహతా పూర్తిగా గడపలేక పోయినపక్షమున ముసలివాని యాస్తియు నాకు చెందు నని యింతకు పూర్వము చెప్పినానుకదా! వానికి చ్చుట యేదయిన ప్రమాదము రావచ్చును. అయినా? ఆప్రమాదము ప్రాణాపాయకరమైన దయిన నీకీ యాయిదువందలతో పాటు మరియయిదువేలు ముట్ట గలవు. ఏమి! తెలిసినదా?"

"అయిన నే నిప్పుడు పోయి వీనికంఠము త్రుంచివేయవలయు ననియెదవు? ఏమి? అది కొంచెము చిక్కువ్యాపారములాగున కనుపించు చున్నది. దాని వెనుక పోలీసువారు, పత్తేదారులు గుంపులు గుంపులుగా వచ్చి సంగతేలాగున జరిగిన దని సావెంటబడి తణిఖీ యారంభింతురు. చాల గందరగోళము. అంతవ్యాపారమునకు అయిదు వేలు స్వల్పము. ఆహా! చాల తక్కువ. కిట్టుబడి కాదు. పదియయిదు వేలు. ఉహు. ఊ. ఇరువదియయిదు వేలయిననేమో! ఉహు. ఊ" అని తల అడ్డుగా నాడించినాడు.

హర్త్రాజీ సాభిప్రాయముగా చూచినాడు. కొంతసేపు వా రొకరి నొకరు దీక్షగా చాలతీవ్రముగా చూచుకొన్నారు. తరువాత వారిదృష్టులు నేలకు వాలినవి.

"సరే. మంచిది. ఇరువదియయిదు వేలే నీవు చెప్పినట్లు.

కాని నీవు తుపాకిమాత్రము ప్రయోగించకూడదు. జరిగినకథ కేవలము ప్రమాదములాగున కనుపించవలయును. తెలిసిన దా? ఈచుట్టు ప్రక్కల పెద్దగిరిశవృక్షము లున్నవి. కదా?" అని రహస్యముగా నడిగినాడు.

"ఆహా. చచ్చినన్ని. ఇది పూర్వులనాటి యడవికదా! స్మశానమునకు చాల వీలుగ నుండును. నిగతరకము చెట్లు కూడ నున్నవి. అవయి........"

"ఊహు. ఊ. నిమురగన్నేరు చెట్లే మంచివి మనపనికి. అవి చాల పెళుచుగనుండుటచే వాటికొమ్మలు తరుచు మనకు చెప్పకుండగనే విరిగి పడుచుండును. ఏమి. పడవా?"

"పడి మనతలలు పగులగొట్టుటో నడుము విరుగగొట్టుటో జరిగించుచుండును. పడుటకు మునుపు లేశమైనను పరచవు కూడను." అని జవా బంగీకరించినాడు.

హర్హాజీ రుసరుస లాడుచు చాల తీవ్రముగా "మతిపోలిన ముసలిముండవాడా! నాయభిప్రాయము నీకు పూర్తిగా బోధపడు చుండుట లేదా? నేను నీకు ప్రతిస్వల్పసంగతియు బోధపరచవలయునా? నీవు ఫిరోజుకోసము నిమురగన్నేరు చెట్టుక్రింద నయినను కనిపెట్టుకొని యుండవలయును. నీకట్టి పనులకు వినియోగపడు చెట్లు చాలగ నున్నవి. అతడు వచ్చుసంతలో నీవు వానివీపుమీదనో నెత్తిమీదనో లాగి యొకదెబ్బ కొట్టు. తరువాత నతడు చెట్టుకొమ్మ పడి ప్రమాదవశమున చనిపోయినటుల కొమ్మయొకటి యేర్పాటుచేసి నాట

కము పూర్తి చేయవలయును. నీ వంతవరకు చేయుట నిజముగా చాల సులువేకదా! దాని తరువాత నీకు యిరువది వేలరూపాయీలు. నిజముగా నట్టిదానికి ప్రయత్నించి చూడవలసిన బేరమే. ప్రపంచములో జీవితకాల మంతయు నిద్రాహారములకొరకు సరిగా లక్ష్యముచేయక కష్టపడి పనిచేసిన కూడ యవసానమున నందులో యిరువదియవవంతు కూడ నిలువచేసి కొనగలిగినవారు చాల తక్కువ. నీవు బీదవాడవు. వయసుమీరిన వాడవు. ఇట్టి మంచితరుణము పోగొట్టుకొనకూడదు. కష్టము తక్కువ ఫల మెక్కువ" అని భ్రమ పెట్టినాడు.

జబారు చాల తాజుగా "నే నెన్నడును హత్యచేసి యెరుగను. కాని యీ బేరము మీరు చెప్పినటుల మంచిది లాగునను, బాగుగ కిట్టుపడి యగులాగునను కనుపించుచున్నది. అయ్యా! నేను మీరు చెప్పినటుల తప్పక చేసెదను. కాని మీరు కార్యానంతరము యిరువదివేలు తప్పకుండ యిచ్చెదరని నమ్మకమేమి నాకు. అందులకు చిన్న చీటిముక్క యొకటి వ్రాసి యీయ వలయును"

"నీవు నిజముగా నన్నీమాత్రమునకు విశ్వసించవచ్చునుకదా!" అన్నాడు హర్జాజీ.

"ఆహా. అది వట్టిమాట చచ్చినా? ఎన్నడును నమ్మలేను. ఇక నెన్నడును నమ్మజాలను. నే నా ఫిరోజునయినను నమ్మగలను గాని బలవంతముగా నాగొంతుక కోసినను నిన్ను

రూపాయీ లొసంగుదు నని వాగ్దానము చేయుచున్నాను' అని వ్రాసి నీవు పూర్తిగా సంతకము చేయవలయును. పొడి యక్షరములు పనికిరావు"

ఆముసలివాని బుద్ధిమాంద్యతకును, అమాయికత్వమునకును, పొరలు పొరలుగా వచ్చిన నవ్వణచుకొనుటకు రామసింగు చాల కష్టపడ వలసివచ్చినది. హార్తాజీ క్రమప్రకారము ప్రమాణ మొనర్చినాడు.

అతడు డగ్గుత్తికతో చాల తీవ్రముగా "ఓరి బుద్ధిమాలిన ముసలిగాడిద ముండకొడుకా! ఇట్టి కాగిత మొకటి నీస్వాధీనమున దొరకిన మన యిరువురకు శిరచ్ఛేదనము కాకున్న యింకేమేమి యుండును?" అన్నాడు.

"అయిన నీవు నన్ను మోసగించవని నాకు నమ్మకమేమి? అదికాక నీకు ఉరిశిక్ష యగును. నన్ను విడిచి నీ కొకనికి రాదే! ఇక నీ కిందు వచ్చిన యెక్కువప్రమాద మేమి? ఇందులోని యెక్కువభాగము ప్రమాదము నానెత్తినే పడుచున్నదే! నీది స్వల్పమేను. అదైనను లేకపోయిన లేకపోవచ్చును. నీ వాకాగితము నా కిచ్చెదవు. నే నన్నప్రకారము కార్య మొనరింతును. నీవు నీమాటలప్రకారము డబ్బంతయు నా కిచ్చివేయుదువు. నేను తక్షణము మారుమాట చెప్పకుండ నీకాగితము నీ కిచ్చి వేయుదును. నీ వాకాగితము పుచ్చుకొని బెంగతీర ముక్కముక్కలు చేయుదువు. అంతే. సంగతంతయు మొదటినుండి చివరవరకు చాలసాపుగను సులువుగను

కనుపించు చున్నదే! నీవింకను గొణగవలసినంత యగత్య మే మున్నదో నాకు కనుపించుటలేదే. నీ కిష్టమున్నచో వ్రాసి యీయవచ్చును. లేదా సీతో గూడను నీవు పోవచ్చును. ఇంక బలవంత మేమున్నది? ఈవ్యాపారము పెట్టినది నేను కాదే? నా క్రింద తగ యొంటరి మేరియును లేదు."

హర్తాజీ తీవ్రముగా లేచి నించి, వానివిద్యాభివృద్ధి కర్త మైన రీతిని తిట్లతో కేకలు వేయుచు చాలకోపము గా యిటునటు పచారుచేయు నారంభించినాడు. వాని దృష్టి యొకసారి మూలలను నమకులతో ని డియున్న తుపాకిమీదకు పోయి క్షణకాల మచ్చటనే దీక్షగా నిలచినది. అత డది యందుకొని జబారుమీద నుపయోగించుమనని, దానితో తగువు సులువుగ పరిష్కారమగునని రామసింగు కొంతవరకు, అభిప్రాయ పడునంతవరకు వచ్చినది వానికోపము. కాని యత డప్పటి కప్పుడే పూర్తిగా జబారు చేతులలో చిక్కియున్నటుల బోధ పడుటచే వానికోపము క్రమముగా చల్లారినది. ఫిరోజును వధించు వ్యాపార మతడు మీదపెట్టుకొన్నయెడల, జబారు కాకీగా మిగిలి జరిగిన హత్య ఋజువు కావలసివచ్చినప్పుడు బెదరించుచు కావలసిన సాక్ష్య మొసగుటకు సిద్ధముగా నుండును.

ఋజువుపడుట సందేహామే యనుకొనినను ఒకనిని యనుమానించుట కవకాశము కలిగిన తరువాత సాక్ష్య మెట్టి వంకరమార్గములబట్టి పోవునో యెవరు చెప్పగలరు? అదికాక

చ్చినా తెలియదు. నీ కెప్పుడు సెలుగ నుండునో యదిమాత్ర ము చెప్పిన మన మిద్దరమును పుచ్చుకొందము. నేను సొమ్ము తీసికొందును. నీవు వెంటనే కాగితము తీసికొనగలవు. నే నా నిమిషముననే రంగూనుకు రవాణాయై పోవుదును. అక్కడ కాపుర ముండుటకు నాకు చాలకాలమునుండి స ర దా గా నున్నది."

హర్తాజీ సమాధానమేదియు నీయలేదు. కలము కాగి తము పుచ్చుకొని కావలసిన వ్రాతపనిలో నైక్య మయిపోయి నాడు. అదియారుట కిత డా కాగిత మటు నిటు విసరి కొంత లో జబారున కందించినాడు. అత డది చూచుకున్నాడు. ము ఖము వికసించినది. తృప్తి పడినటుల తల యూడించినాడు.

"ఇది పద్ధతిప్రకారము సాక్ష్యసంతకములతోనున్న నిం తకన్న బాగుగ నుండిపోవును. కాని యన్నియు కలసిరావు క దా! ఏమిచేయుట." అని జబారు మూలిగినాడు.

హర్తాజీ చాల వికారముగా "స్టాంపు" మీద వ్రాసి 'రిజిష్టరు' చేయించిన నంతకన్నను బాగుండును అన్నాడు. కా ని జబా రది గమనించలేదు. అతడు తిరిగి "సరే, జరుగవలసి న మిగత సంగతులు. ఫిరోజు ప్రస్తుత మీాప్రాంతములనే ఉ న్నాడు. అతడు మూడువారముల కొనసవాసము కాలపరిమితి లో పూర్తి చేయుటకు రేపే యడవుల ప్రవేశించి ప్రవాసమా రంభించును. మన మనవసరముగా నిరీక్షించియుండి దొరకిన యవకాశము పాడు జేసికొన జాలము గనుక యెంతత్వరలో పని

ప్రారంభించిన నంత మంచిది. అందుచేత నీవు రేపుసాయంత్రి మే పని ప్రారంభించుట చాల మంచిది"

"ఓ. అంత కన్ననా! కాని నీవుకూడ వెంటనున్న బా గుండునుగదా?" అని జబా రడిగినాడు.

హార్తాజీ కర్పూరముగా నవ్వినాడు. వెంటనుండి యూహా త్మ్యావ్యాపారము యధావిధిగా సానుకూలపరపించవలయు న ని వానికికూడ చాలా అభిలాషగా నున్నది. కాని బాగుండక పోవుట కన్న ప్రమాద మెక్కు వ యని సందేహించినాడు.

"నే నిక్కడ నుండజాలను సరిగదా, ఈప్రాంతముల లోకూడ నుండను ఉండకూడదు. నీకొరకు పట్టణమునుండి యే వచ్చుచుందు నప్పు డప్పుడు" అని చెప్పినాడు.

"సరే ఆలాగే వచ్చుచుండుము. రేపుమధ్యాహ్నము వచ్చి, దూరముననున్న యూడొంకలచాటున దాగొని యుండు ము. నీ కచ్చటినుండి పైవరుస కిటికీలు పూర్తిగా కనుపించు ను. అక్కడనుంచియే చూడుము. వ్యాపారము సానుకూలము గా నున్నపక్షమున చివర కిటికీలో వెలుపలగా నొకపాతక మీాజు వ్రేళ్ళాడ గట్టుదును. తెలిసినదా? అదే యానవాలు. అప్పుడు నీవు తిన్నగా రావచ్చు నిక్కడకు"

"సరే. అది చాల బాగున్నది. నీ వేలాగయిన నాపని కొనసాగించ వలయును సుమా!"

"నేను మాత్రము వ్యతిరేకము చెప్పితినా? నేను కో రున దంతయు నేమన సంగతులు స్వభావసిద్ధముగా నుండుటకు

కొంచెము చేయూత యొసగు మంటిని. అంతే. తరువాత నత ని నక్కడనే విడచిపోవచ్చును. వానిసంగతి నలుగురకును వెల్లడియగు నప్పటికి కొన్నిరోజులు పట్టును. అప్పటికి ...... ఊ! రేపు మధ్యాహ్నము. జ్ఞాపక ముంచుకొనుము. అయిదుగంటలకు"

"సెహబాస్. నే నిప్పుడే వెళ్లిపోవుదను" అని హాత్తాజీ చెప్పి లేచినాడు.

రామసింగు వెనుకకు తగ్గి, చీకటిలో ప్రవేశించి, బాటవెంట కొంతదూరము పోయి చటేలున ప్రక్కకు తప్పుకొని కొంతదూరము మారుమార్గమున పోయి డొంకలలో దూరి మరికొంతసేపటిలో వెలుపలకు వచ్చునప్పటికి వాని నెవ్వరును సులువుగా గురితించ గలిగియుండరు. పలసన యతడు చిన్న మొనగల యొక కురుచగడ్డము తగిలించి దాని కీడగున ట్లుల కనుబొమలు బాగుగా బలపరచి, తలమీది కత్తిరింపుజుట్టు పొడిగించి కొ త్తరకము తలపాగ చుట్టినాడు. చేత చిన్న పెట్టికూడ పట్టుకుని. అత డన్నివిధముల నొక చిత్రకళావిద్యార్థిని పోలియున్నాడు. అత డావేషముననే ఆచేరువనున్న గ్రామములో కొట్టొకటి యద్దెకు తీసికున్నాడు. మొత్తముమీాద నతడు చేసిన యాయేర్పాటు లన్నియును చాల తెలివితేటలుగను చమత్కారముగను ఉన్నవి. సంతుష్టిపడినాడు.

---

## ౩౧

అవసరమును బట్టి పెదవి కదపకుండ నుండుటలో రామసింగున కీడగువారు చాల తక్కువ. అట్టిశక్తి కుదుర్చుకొనుట చాల కష్టము. మానవాతీత పనియే చెప్పవచ్చును. అతడు ముఖముమీద నక్కడక్కడనున్న "పలస్దరి" పట్టీలతో చాల నీరసముగా నాయాసపడుచు, మరుసటి యుదయమున వేళదాటిన చాలసేపటికి యెప్పటి కాపీహోటలు దగ్గర తయారుపడినాడు. ఆతని కనుబరచు తుకారాముని మితిమీరిన ప్రశ్నలు, వానిదగ్గరనుండి హ్రస్వమైన మూలుగులును తప్ప యితర మేదియు సంగ్రహించ లేకపోయినవి.

అతడు నెమ్మదిగా "అవసరమైన సమాచారమంతయు నీకు క్రమముగా వా నంత టదే తెలియగలదు. మన మిప్పుడు ఫిరోజును వధ్యస్థానమునకు — అనగా నతడు ప్రదర్శించనున్న యాకష్టనాటకముయొక్క యాఖరుయంకములోని రంగస్థలమునకు తీసికొని పోవలయును. ఇదిగో ఫిరోజు! నీ వు పూర్తిగా, కడుపునిండ, కరువుతీర భుజించుము. తిరిగి తిండి యెప్పటికి దొరకునో. చాలకాలము మందులేని మంచిశరీరస్థితి" అన్నాడు.

"ఆహా! అవసరమయిన నెన్నిరోజులయిన నుందును. తుకారాము పిట్టలను పట్టుకొనుటకు మంచి సులు వొకటి

చూపించినాడు. నే నది పడవికి వెళ్ళిన తక్షణమే ప్రయో
గించవలయు నని యున్నది.''

"ఓయి అబ్బాయి! నీవు ముందుగా రెల్లువగయిరాల
కొసలు జారుముళ్లు వేసి యుచ్చులు వేయుటమాత్రము మర
చిపోకు సుమా! నీవు తాళ్ళతో వేయు జారుముళ్ళు చిన్న
జమ్మి పుల్లలమీద నిలిపి, కుందేళ్లు మెలుగుల దగ్గర యు
చ్చులుగా పెట్టియుంచుట మంచిది. అది చాలవరకు పొరపడ
కుండగనే పని చేయును. మొదట కొంచెము చిక్కగను వి
సుగ్రగను ఉండునుగాని యీమాత్రమునకు ఫరవా లేదు. మ
రి యొకటి. నీ వొకసారి రాయి రప్పకొట్టి కొంచెము తాటా
కులపడి నిప్పు చేసితివా తరువాత నిక బాధ యుండదు. ఆ ని
ప్పులాగుననే యీరకముగ మందు మందునటుల చేసికొనవచ్చు
నుగదా!'' అని తుకారాం సభిమానపూర్వకముగా సలహా
యిచ్చినాడు.

రామసింగు స్వల్పముగా మందహాసము చేసినాడు.
కాని యేమియు పలుకలేదు. ఫిరోజుకొరకు హర్తాజీ యేర్పరచి
సిద్ధముచేసి యుంచినదా ఫిరోజున కావంతయయిన ననుమాన
మున్నటుల కనుపించదనియును, హర్తాజీకోసము రామసిం
గేమి చేయనున్నదియు హర్తాజీ కంతకన్న తెలియదనియును
రామసింగు చిరునవ్వులోని గూఢాభిప్రాయము.

ఉదయ మింకను పూర్తిగా ముదరలేదు. పెద్దబరువైన
మోటారుకా రొకటి అంత కష్టప్రయత్న మక్కరలేకుండగనే

యడవికి పోవు కంకరబాటను పట్టి పోయి, దట్టమైన యొక కంచె చేరువ నాగినది. ఆముగ్గురు బండి దిగినారు.

"ఈకంచెయే మీపెదనాయన కిక్కడనున్న భూవసతికి దక్షిణపు సరిహద్దునకు ప్రారంభము. మేమి నిన్ను సాగనం పుటకు కొంతదూరము వచ్చుటలో మోటా రిక్కడనే నిలిపి యుంచెదము. రా! ముందునకు నడువుము పెండ్లికొడుకు లాగున" అని రామసింగన్నాడు.

ఆయూవరణలో నక్కడక్కడనున్న యగ్గిరాళ్లు కొన్ని తుకారాము ఫిరోజునకు చూపి, యందులో నివికొన్ని జాగ్రత్త పరచుకొను మని సలహా యిచ్చినాడు. అట్లాయోవను వా రావిధముగా దూరమున నున్న యిల్లు కనుపించువరకును ముందునకు పోయి యక్కడ నాగినారు.

"ఈవైపుగా ముందుకు పోవుట యొంతమాత్రమును లాభము లేదు. నే నీప్రదేశము నయి యిదివరకే పరిశీలించి యుంటిని. ఆపల్లములో మకామున కనుకూలముగనుండు మంచిస్థల మొకటి యున్నది. చూడు. అదిగో. ఆపడిపోయిన చెట్టు తల దాచుకొనుటకు నీకు మంచి చోటగా నగ గలదు. అక్కడకు చెరువుకూడ చాల చేరువగా నుండును. నీకు కావలసిన యొండుకర్రలు, బెరడుకూడ నక్కడనే దొరకగలవు. చెట్టుబెరడు చుట్టబెట్టి యెర్రమట్టి పూతపూసి కక్కురితికి కుండ చేసికొను విధము నీకు తుకారాం యిదివరకే చెప్పియుండు నను కొనియెదను?" అని రామసింగడిగినాడు.

"ఆ! వానికి కావలసిన చిల్లర వ్యాపారములు చాలవరకు చెప్పితి నని నానమ్మకము. సరే. ఇక చేయవలసినది వానిజే బులు తణిఖీచేసి యాయుద్ధపరికరము తీసివేయుటయే యను కొందును." అని తుకారాము సందేహించుచు నడిగినాడు.

రామసింగు గంగీకారసూచకముగా "అవును. అదికూడ నందొక పరతే. అతడు గడియారముమాత్రము వెంట నుంచుకొన నంగీకరించుటకు మాట యిచ్చినాను. అది వాని కాహారము నిమిత్తము పిట్టలను పట్టుకొనుటకు సహాయపడ దుకదా? ఇదిగో! శిరోజా! చాల శ్రద్ధగా విను. దూరమున నానిసురగన్నెరు చెట్టు కనుపించుచున్నదా, చుట్టును దట్టమైన సరక్కసిడొంక లున్నవి? నీవు సరిగా సాయంత్రము అయిదు గంటల కక్కడకు పోయి, ముఖము తూర్పునకు, అనగా మన మీయుపవిప్రవేశించిన దిశకు పెట్టుకొని కూరుచుండ వలయును. నేను కదలుమని యాజ్ఞాపించువరకును నీ వక్కడనే కూరుచుండ వలయును. ఏమి సంభవించినను సరే కదల కూడదు. వెనుకకు తిరిగియైన చూడకూడదు. ఉహు! ఊ! బోధపడుచున్నదా? ఇది చాల యవసరమైన సంగతి. సరిగా నయిదుగంటలకు. ఆ!"

"చిత్తము సరిగా నాలాగుననే చేయుదును"

"సరే! ఇక వేటకు ప్రారంభించుము. నీకు మేలు చేకూరుగాక."

తరువాత రామసింగు తుకారాముని చేయిపట్టుకొని

ప్రక్కకు లాగినాడు. ఇరువురు బయలుదేరినారు. వారెంత మాత్రమును తిరిగిచూడకుండ యాకొత్తజాతి కోయవాని దృష్టిపథమునుండి దాటి దూరముపోయిన తరువాత రామసింగు తుకారామును కారుచక్కకు పంపివేసి తానేదో దూరప్రయాణమునకు నొంటరిగా బయలుదేరినాడు. అతడు తిరిగి వచ్చుటకు తుకారాము కొన్నిగంటలకాలము కనిపెట్టుకొని యుండవలసి వచ్చినది. కాని యతడు వానినేమియు నడుగలేదు. రామసింగు వానికేమియు చెప్పలేదు. వారు తిరిగి వంటలు చేసినతరువాత రాముడు గొంకపడకకుర్చీలో పరుండి భోజనపువేళవరకు హాయిగా నిదురపోయినాడు.

ఈలోపున ఫిరోజు కోయజీవితములోని యానందములను స్వల్పముగా ననుభవించి సంతసించ ప్రారంభించినాడు. అందులోని మొదటిది నిప్పురగులబెట్టుట. తొలుత యొండుగడ్డి కొంతతీసి మధ్యకు మడతపెట్టి, ఒక చివర గుండ యగునట్లుల నలిపి, తరువాత రెండు రాళ్లు కొట్టి నిప్పునెరుసులు పుట్టించి యాగడ్డి యంటించుట. ప్రారంభమున తుకారాము చేసి చూపినపుడది చాల సులువుగను, తేలికగను కనుపించినది కాని యుప్పుడతడాదిక్కుమాలినగడ్డి యంటించి మంటచేసి కృతకృత్యుడగునప్పటికి వాని కొకగంటకాలముతోపాటు కావలసినంత దేహశక్తియు, యోపికయుకూడ ఖర్చుపడినవి.

ఒకసారి మంట రగులగనే యతడది యారిపోకుండ నుండుటకై నలుప్రక్కల పరుగెత్తి కొంతకాలమునకు సరిపోవు యెండుపుల్లలు పోగుచేసి మంట పెద్దది చేసినాడు. ఏలనన

నిప్పు కావలసినప్పు డెల్లను రాయి రాయి రాపాడించి యా నిర్మకాండ జరుపుట వాని కెన్నడును రాత్రియము వచ్చినదికాదు. అ నవసరమైనను కూడను. అందుచేత నాపని తరువాత నతడు కుం డ చేయు ప్రయత్నమునకు దిగినాడు.

అత డందుకొరకు చాల తంటాలుపడ వలసివచ్చినది. తుకారా మొక పలుచని చెట్టుబెరడు తీసి, కోణముగా నున్న రాతితో కచ్చితముగా తెగగొట్టి గుండ్రముగా వంచి, రెండు కొనలును ముండ్లతో నాటుకొట్టి ఒకచక్రము తయారు చేసినా డు. ఆలాగుననే మరియొక బెరడుముక్క తెచ్చి గుండ్రముగా కొట్టి, అది మొదటిచక్రమున కొకవైపున ముళ్ళతో గుచ్చి నాడు. తరువాత దానివెలుపల నన్నిప్రక్కలను జిగురుగానుండు యెఱ్ఱమట్టి దళసరిగా మెత్తి నెమ్మదిగా యెండనిచ్చినాడు. తరు వాత నది పూర్తిగా బిగియుటకు నిప్పులో వేసి కాల్చవలయు ను. తుకారా మదివర కంతవరకు చేసి చూపించిన పని చే యుటకే ఫిరోజునకు చాలకాలము పట్టినది. ఈలోపున పిట్టల కోసము దర్భలు జారుముళ్ళు వేసి యుచ్చులు తయారుచే యు లేదనిన సంగతి వానికి స్ఫురణకు వచ్చినది. అయినను అతడు కుండలు చేయుప్రయత్నమున పట్టుదలగా కూర్చుని చాల కష్టప్రయత్నముమీద చివరకు కుండ యని చెప్పిన సి గ్గుగలుగున దొకటి తయారు చేయగలిగినాడు. అత డది యా నందముగా నెండలో నుంచి యాహారమునకు పనికివచ్చు కుం దేళ్లు మొదలయిన లోకువజంతువు లుండువాసస్థలములు కనిపె ట్టి వచ్చుటకై సంచారము బయలుదేరినాడు. వాటిలక్షణము

లు కూడ తుకారాము చెప్పియున్నాడు. వానికి ప్రస్తుత మెక్కువ యవసర మవియేకదా!

అతడు కుందేళ్లకు చాల వోట్లు తిరిగిచాల చిన్నదొంకలకొమ్మలు ముడివెట్టియు, వాటి బొరియలదగ్గర ఉచ్చు లేర్పరచియు యావసరమైన ప్రయత్నము లన్నియు చేసినాడు. తరువాత గడియారమువైపు చూచుకున్నాడు. అప్పుడు ఒకటిన్నర గంట యయినది. అత డనివరలో ప్రతిదిన మావేళకు సరిగా నారగించుచుండెడి షడ్రసోపేతమైన భోజన మొక్కసారిగా వానికి స్ఫురణకు వచ్చి వాని కెక్కడలేని యాకలిని కలిగించినది.

దురదృష్టవశమున కడుపున వేసికొనుటకు వానికేదియు లేదు. సంధ్యాసమయమున కుందేళ్లు బొరియలనుండి షికారు వెలువడి వాని యుచ్చులలో పడినప్పుడుగాని యాలోపున వాని కేది యుండదు. ఉండు నని యత డను కొను నవకాశముకూడ నుండదు. పండ్లకొరకు వెతకుటకూడ నిరర్థకము. అది పండ్లఋతువు కాదు. ఎక్కడైనయిన నొకటి రెండు కనుపించినను యేరకము తినవచ్చునో, యేరకము తినకూడదో తుకారాము వర్ణించి చెప్పినాడుగాని యాసంగతి వాని బుర్రలో లేదు. కంటి కందముగాలేనివి బాగుండ వచ్చును. కంట్క కందముగానుండి తినుటకు మనసుగొల్పునవి విషజాతివై యుండవచ్చును. అందుచేత నత డాపాంతకు పోలేదు.

అతడు తిరిగి మంటదగ్గరకు పోయి కొంత మోడు కర్రందులో వేసి మంట రగుల బెట్టి మతి లేని వానిలాగున నటు

నిటు తిరిగి యదివరలో నిరసించిన రొంఘుమూఘుముంపలు తీసికొని వచ్చి, నిప్పులో వేసి కాల్చి తప్పని సరిగా కడుపు నింపుకున్నాడు. అదివరలో యింటిదగ్గర శుభ్రముగా నేతితో వేయించి, ఉప్పు, కారము, తదితరరసవర్గములతో తయారు చేసినట్టుల మాత్రము రుచిగా లేవు. దానికి దీనికి సహస్రాంతము తేడా యున్నట్టుల కనుపించినను ఆకలిమాత్రము తీర్చినవి.

మరికొంచెము సేపటిలో గువ్వ యొకటి చేరువనున్న డొంకమీద వానికి కనుపించినది. అతడు చాలగ సంతసించి, రాళ్లు పోగుచేసి దూరము నుండియే దానిమీదకు విసరినాడు. అది దూరము నుండి విసరినంత సేపును కదలక మెదలక కూర్చుండి దగ్గరగా సమీపించునంతలో వానిని కేలి సేసినట్టుల కెవ్వన యరచి యెగిరిపోయినది.

అంత డదివరకు పుస్తకములలో చదివిన యాయూ బాపతు కథ లన్నియు వాని కొకటితరువాత నొకటిగా స్ఫురణకు వచ్చినవి కాని వానిలోని నాయకులు యవస్థంబుపడి కృతకృత్యులయి రని చెప్పినపద్ధతులలో నొకటియు వాని కుపకరించినదికాదు. అందలి నాయకులు యోడలు పగిలి సముద్రము న బడి తుపాకులతో కావలసినంత మందుగుండుసామానుతో యీదుకొని గట్టునపడుట యో, లేక విధినిర్ణయమువలన తన్ను తిని తినుబండారముల కొట్టులో పడినట్టుల, పండ్లతో ములిగి తేలుచున్న యేద్వీపముననో పడి కష్ట మిసుమంతయు లేక చెట్లను పండియున్న కాయలు చేయి చాపి కోసికొని తినుటయో తటస్థించుటచేత నంత యెక్కువశ్రమ యనుభవించి

యుండెడు. కాని మన వాని కట్టి యవకాశము లేమియు లే నందున సాహసికపుకథ లన్నియు కట్టుకథలనియును, కవికల్పిత ములనియును మోసములనియును, యత డభిప్రాయ పడవలసి వచ్చినది.

తరువాత ప్రశస్తమయిన పానోదక మాధారముగా మానవుడె ంతకాలము సజీవుడై యుండగలడని యతడు జ్ఞాపక మునకు తెచ్చికొనుటకు తీవ్రముగా ప్రయత్నించుచునంతలో అ త డదివరలో యుచ్చులు పన్నియుంచిన వైపునుండి పెళుక్కు మని విరిగిన చప్పుడును, ఒక దీర్ఘమయిన యేడ్పును వినుపిం చినవి. కెవ్వున కేక వేసి యతడు చప్పట్లు చరచుచు యానంద ముగా నావైపునకు రివ్వున పరుగెత్తినాడు.

జయము! సెహబాస్!! వానికి కావలసినంత ధైర్యము వచ్చినది. అత డానందముగా గెంతులు వేయుచు ముందుకు ప రుగెత్తినాడు. ఏలనన రోజులకు్కవ కుందే లొకటి స్వప్రయో జనపరుడైన మానవుడు తనకొరకు కల్పించియుంచు వివిధము లైన యాపదలను, గురితించలేక వెలుపలకు వచ్చి ఫిరోజు సిద్ధముచేసి యుంచిన యొక యుచ్చులో పడి చిక్కుకొని గిల గిల కొట్టుకొనుచున్నది. అతడు దానిని పట్టుకొని వెలుపలకు తీసి యుచ్చు తిరిగి తయారుచేసి దూరముగా పోయినాడు.

అతడు చాలవరకు నటునిటు పచారుచేసి తగినంత వ్యాపకము లేనందున సాయంత్రి మయిదుగంటలకు రామ సింగువచ్చువరకు నిదురపోయి కాలక్షేపణ చేయవచ్చునని

తలచినాడుకాని వానికి నిసురవచ్చు లక్షణము లెంతమాత్ర
మును కనుపించలేదు. అతఁడాచేరువనున్న చెరువుదగ్గరకు పో
యి కడుపుపట్టినన్ని నీళ్ళు త్రాగినాడు. నీళ్ళతో నాకలి తీరు
నా? కూడేలునయిన నేమిచేయుగలడు? అంతయు సిద్ధముచేసి
కడుపున పడవేయ నిలుచుకొన్నను వాని కససరమైన మిగత
కారము వగయిరా లేకపోయినమానె, ఉప్పుకూడ లేకుండ
నేమిచేయగలడు. అప్పటివరకు కాసంగతియే స్ఫురణకు రా
లేదు. తిండి కేమి లేకపోయినమానె ఉన్నంతవరకు తుక్కు
దూగర తినవలెనుకొన్నను ఉప్పు లేకుండ తినుటకు నోరు
రాదుకదా! అతఁడాసంగతి సాయంత్రము రామసింగువచ్చిన
ప్పుడు చెప్పి కొంచెము తెచ్చిపెట్టుమని యడుగుటకు భ్రమ
పడినాడుగాని యట్టిపని మంచిది కాదని విడచి వేసినాడు.

అతఁడు గడియారము చూచినాడు. మూడుగంటల ము
ప్పదినిమిషము లయినవి. అతఁ డంతట నుదయమున రామసిం
గు నిర్దేశించిన నిమ్మగన్నేరుచెట్టుక్రిందకు పోయి కూర్చుని ప
రధ్యాన్నముగా జేబులోనికి చేయి పోనిచ్చి సిగరెట్లపెట్టె
కొరకు తడిమినాడు. కాని నవనాగరికతకు ప్రధానమై, తరుణ
వయస్కుని జీవితమునకు ముఖ్యాధారములలో నొకటియైన
అట్టిసంపత్తయు నతఁడాయుదయమున జేబులు ఖాళీచేసిన
ప్పుడు మిగతసరుకుతోపాటు రామసింగు స్వాధీనము చేయుట
స్ఫురణకు వచ్చి యతఁడు వేసిన దీనమైన వెఱ్ఱికేక యెట్టి కఠిన
హృదయునకైనను కంటనీరు తెచ్చిపెట్టక మానదు.

అతడు నెరవేర్చ స్థిరపరచుకొనిన వీలులోని మూడవ వరతు చివరవరకు కొనసాగించ లేకనినది సందేహము వాని కప్పుడు కలిగినది. ఆ కవరకు లేదు. అడవిలో కాపురము, తినుటకుతిండి లేకపోయినను ఉప్పు కారము లేనిదుంపలయిన తిని మూడువారములు కాదు ముప్పదివారము లైన కాలక్షేపణ చేయవచ్చును కాని నోటికి సిగరెట్లు లేకపోయిన నొక్కపూట యయిన గడుపుట కష్టము. ఘడియ గడియదు. అసాధ్యము. కేవల మసాధ్యము. అయినను తగినంత ప్రయత్నము చేసి వీలు తప్పివచ్చువరకును పందెము మాత్రము విడిచిపెట్టు రకముకాదు.

కొంద రడవిపొగాకుగాని, యట్టిది మరియొకటిగాని కాల్చి కక్కరితి గడుపుకొందు రని వినికలుల వానికి జ్ఞాపకము లేదు. అ దేదో వానికి జ్ఞాపకము లేదు. ఆసంగతిమాత్రము రామసింగు వచ్చినతరువాత నడిగి తెలిసికొనవచ్చును. ఈ లోపున కాల్చుకొనుటకు చేసి సిద్ధముగానుంచుకొనిన మంచి దని మట్టితో గొట్టమొకటి (సుంగాణి) తయారు చేయ ప్రారంభించినాడు. అతడు గుల్లగా నుండుకర్ర గొట్ట మొకటి వెతకి వాడిగనున్న రాతితో నొకప్రక్క సరిగా తెగగొట్టి చిన్న గిన్నెమాదిరిగా చేసినాడు.

అతడు సున్నితముగా తెగగొట్టుటకు యొతవాడిగనున్న రాయియైనను బాగుగ నున్నటుల కనుపించినది కాదు. అతడది యిది మార్చి యోపికపట్టి చాలకష్టపడి సాయంకాలమగునప్పటి కొకవిధమైన చుట్టగొట్టము తయారుచేయ గలిగినాడు.

ఇక నగి లోపల సరిగా గొలికి సాపుచేయుట తరవా యిగా నున్నది.

అంకుచే నతడు వాడిగా సన్నముగానున్న రాతిము క్క యొకటి తీసికొని దానితో చాల జాగ్రత్తగా, యోపిక గా సాపుచేయు ప్రారంభించినాడు. ఆగొట్టము తయారగునప్ప టికి కొంతకాలము పట్టునో వానికే యాశ్చర్యముగానున్నది. అత డాగొట్టము కాల్చుట మొదలగుగాగల యితరవ్యాపార మునకు యెండుపుల్లలు ప్రోగుచేసి చెట్టుమొదట కూరుచున్నా డు. ఆకస్మికముగా తుప్పపడి వణకి నిశ్చేష్టితుడై విగ్రహంవలె నిలచిపోయినాడు. దూరమున నేలమీది తు ప్పలలో నేదియో చిన్నముక్క యొకటి పెళుక్కుమని విరిగిన చప్పుడయినది.

వెనుకకు తిరిగి చూడవలయునని,యును ఒకసారి లేవ వలయుననియును తుప్పలలో దూరి వెతకవలయుననియును వానికి బుద్ధి పుట్టినదికాని యతడు యుదయమున రామసింగు న కొసగిన వాగ్దానమునంగతి చటేలున స్ఫురణకు వచ్చినది. చెప్పు లదివరకు కన్న నెక్కువగా నిక్కబెట్టి, సాయంకాలపు నిర్మలతను భంగపరచుచు నక్కలు జయములుదేరిన నానా బాప తుల ధ్వనులు విన నారంభించినాడు. అం దెంతమాత్రమును పొరపాటు లేదు. ఎవరో వెనుకనుండి వానిని రహస్యముగా సమీపించుచున్నారు.

---

## ౩౨

హార్తాజీ కా రాత్రి కులాసగా కాలక్షేపణ జరిగినది కాదు.

వాస్తవమే! ఆతడు ముసలివర్తకుడు రత్నాజీ సీలులోని షరతులు సవ్యముగా కొనసాగకుండ చేయుటకై కుర్రి మొహతాఫికోజున కడుగడుగున కాటంకములు కల్పించి యవసరమునుబట్టి వానిని హత్య గావించకపోయినను వెత్తుకొని పోయియో, లేక కాలు చేయి విరుగగొట్టియో ప్రయాణము చేయ వీలులేని స్థితిలోనికి తెచ్చి నియమితకాలము దాటబెట్టుటకు డాక్టరు కర్ణాబర్వేయను నామాకారముగల ప్రసిద్ధపురుషు నేర్పాటు చేసినాడు. హత్యయనిన నెంతమాత్ర మిష్టము లేని డాక్టరు బర్వే తత్వము దారుణముగా మొండి కెత్తిన హార్తాజీహృదయమును కూడ త్రోవలోనికి తెచ్చి కొంత శాంతిలుగ జేసినది.

కాని యిప్పుడో బర్వే హఠాత్తుగా వ్యాపారమంతయు వదలుకొని తల తడుముకొని వెడలిపోయినందున నదియంతయు హార్తాజీనెత్తిని పడినది. అందుచే నతడే స్వయముగా హత్య చేయించుటకు సిద్ధపడవలసి వచ్చినది! సిద్ధపడినాడు. అందుకొరకతడు జామీనుగా వ్రాసి యిచ్చిన యాయుత్తరము నవుకరు జబారుచేత చిక్కపెట్టిన వాని తెలివితక్కువవలనపుట్టినయాందోళన విచారించిన కొలదిని యెక్కువయినది.

అది వానిని మరియొక సాహస్యకు పురికొల్పినది. ఏమన వానిరహస్యము పూర్తిగా తెలిసి వాని నెప్పుడన్న నప్పుడు చిక్కులలోనికి తీసికొని రాగల జబారు సజీవుడై యున్నంత వరకును వానికి మనశ్శాంతి యుండదు. అతడసలు జబారు దగ్గరకు పోకుండిననే బాగుండిపోవు ననియును, వానిజ్ఞాతిని మట్టుపెట్టుట కితడే స్వయముగా సాహసించిన బాగుండిపోవు ననియును, చాలగ పిక్కరించి విచారించ సాగినాడు.

అతడు నిట్టూర్పుగా "కాని యిప్పు డేమనుకొనిన నేమి లాభము? చేయి జారిపోయినది. ముసలిముండకొడుకు కిప్పు డాచీటి వానిగొంతుక తెగగోసినను విడిచిపెట్టడు. వాడీకార్యమున నాకెంతమాత్రము సహాయపడక పోవుటయేకాక దానితో నన్ను యల్లరిపెట్టగలనని బెదరించక మానడు. దిక్కుమాలిన వాడు. ఒకవేళ రాత్రియె రహస్యముగా నెక్కడకయిన పారిపోయి, త్వరలో నాదగ్గరనుండి యపరిమితమైన డబ్బులాగు ప్రయత్నమున నున్నాడేమొ.? ఏమయినను యిప్పుడు చేయవలసిన దే మున్నది. ఇతర యాలోచన యేదియు లేకుండ తలపెట్టిన కార్యము చివరవరకు నడిపించుటయే" అని తటపటాయించ సాగినాడు.

నిద్రమొగి వెసగని కటికరాత్రి గడపి యతడు పొద్దుటనే లేచి, అక్కడ యీయవలసిన యద్దె యిచ్చి, చేరువనున్న పల్లెటూరికాఫీ హోటలులో దొరికిన మట్టుకు కావలసిన దేదియో తిని తొందరగా పోయి దూరముననున్న

దట్టమయిన చెట్లమధ్య కాలక్షేపణ చేసినాడు. అత డాపగ లంతయు మనసు నిలుకడలేక, ఉద్రేకపూరితమైన యస్థిరాభిప్రాయములతోను, భయవిహ్వలతతో నిండిన పరవళ్లతోను కాలక్షేపణ చేసినాడు.

అక్కడ వాని కొకసారి కంగారుకూడ తటస్థించినది. ఏలనన, ఆపాంతములోని గృహస్థొకడు నోట చుక్కను పెట్టుకొని యాతి డున్నవైపుగా వచ్చినాడు. హర్తాజీ వానిని మోసగించుటకై, కంగారుగా చేతిపెట్టె తెరచి, అందులోని రంగులకుంచెతో నొక కాగితముమీద తొందరగా నేదియో వ్రాయ ప్రారంభించినాడు. అది యెవరయిన చూచిన వానికి మతిమాంద్యస్థితిలో లేడేమో నని సందేహించియుండును. అంత యందముగా నున్న దాయాహ్మ్మ. అదృష్టవశమున నాకుక్క తోకజాడించి చెప్రలు నిక్కబెట్ట లేదు. ఆమానవుడును వాని గొడవలో పడియుండి వీని యునికియే గుర్తించ లేదు.

తరువాత నత డొక సిగరెట్టు వెలిగించి యందు నాల్గవ భాగము కాల్చినాడు. కాని యంతకుపూర్వ మాలాగున పోయినమానవుడు వెనుకకు తిరిగి వచ్చుట తటస్థించెనేని నిర్మలముగా నున్నయాయడవిలో సిగరెట్టుపొగ వాని కనుమానము కలిగించి తనను పట్టియిచ్చునన్న సంగతి స్ఫురణకు వచ్చి తక్షణ మాసిగరెట్టు ఆర్పివేసినాడు. కాని పోయిన యామానవుడు మాత్రము వెనుకకు తిరిగి రాలేదు. హర్తాజీ యచ్చటనే నాలుగుగంటలవరకు కుండి, నెమ్మదిగా లేచి క్రిందటి రాత్రి

జబారు చూపిన ప్రదేశమునకు, అనుకొనినటుల నంతయు సవ్యముగా జరిగిన త్వరలోనే తనకు చెందు ప్రదేశమునకు పోయినాడు.

అతడు చాల తొందరపడి, తల బద్దలు కొట్టుకొని కార్యసానుకూలమునకు కావలసిన పన్నాగతికి రాగలిగినాడు. ఇక నెంతమాత్రమును సందేహించ నక్కరలేదు. అతడనుకొన్న కార్యక్రమము సక్రమముగా నడువగలదు. మొహతాఫిరోజు తప్పక జబారుచేతులలో చావగలడు. తరువాత జబారు హత్రాజీ చేతులలో మాయమాట లేక నుడియగలడు.

ఆ సమయము మనసు సాగిపోయినాడు జరుగవలసిన మిగత చర్యలేర్పాటు చేసికొన్నాడు. జబారు వాసిపని కొనసాగించి ఫిరోజు ఆకస్మికముగా విరిగిపడిన కొమ్మక్రిందపడి ప్రమాదవశమున చనిపోయినటులు కనుపించులాగున నేర్పాటుచేయును. వారివురును పరిమిలాను జరుగవలసిన యేర్పాటులను గురించి మాటలాడుటకై ప్రాతయింటిలోనికి పోవుదురు. ఇంట ప్రవేశించిన వెంటనే హత్రాజీ మొదట దొరకిన యవకాశము దొరకపుచ్చుకొని జబారు నెత్తిమీద నొక దెబ్బ కొట్టి చంపి, వాని తల తుక్కగునటుల తుపాకితో పేల్చి, ముసలివాడు ఆత్మహత్య చేసికొనినాడని తోపచేయునటు లాతుపాకి చచ్చిపడియున్న వానిప్రక్క నుంచవలచుకున్నాడు. తరువాత నింటికి పోయి, సంగతి యేతోవను పట్టునో నెమ్మదిగా వోపికపట్టి కనుపట్టి చూచును. ఇంతకును

అందులో నయినను అంత జడియవలసిన దేదియు నున్నటుల కనుపించదు. ఫిరోజు యెవరికిని తెలియకుండ పడినచోటనే కొన్నిరోజులు వారములుకూడ పడియుండును. జబారు యింటికివచ్చి పోవువా రెవరును ఉండరుకదా! అందుచే దీనికైనను జడియవలసిన పనిలేదు.

హర్త్రాజీ మారుమార్గమున పోవు యిల్లు కనుపించక వీలుగనున్న చోట చెట్లచాటున దాగినాడు.

అప్పుడు. అంతయు సరిగా నున్నది. పైవరుస కిటికీలలో నొకదానినుండి చిరిగిపోయిన కమీజు జోకటి వ్రేల్లాడుచున్నది. అతడు మలుపు తిరుగునప్పటికి జబారె వానికోసము కనిపెట్టుకొని యున్నటుల కనుపించినది. ముసలివాడు నిలువుగను బట్ట కప్పుకొని చెవులు, గడ్డమేకాక కన్నులుకూడ కనుపించకుండ ముఖమునకు ముసుగు వేసికొన్నాడు చేతులకుకూడ నొక రకపు కృత్రిమపుతొడుగులు తగిలించుకున్నాడు.

హర్త్రాజీ వానిని సమీపించునంతలో నతడు చేతులు మీద కెత్తి చూపి "నే నివి ప్రత్యేకముగా పనిగట్టుకొని తగిలించుకున్నాను. హత్యచోటనే పోలీసువారు ప్రవేశించి తణిఖీ యారంభింతురనియును, దానికి వ్రేలిముద్రలే యాధారముగా పనిచేయుననియును విన్నాను. అందుచే నట్టి చచ్చు ముండకొడుకుల చేతులకు దొరకకుండ నీయేర్పాటు" అని చాల మెల్లగా తెలివితేటలు వ్యక్తపరచినాడు. హర్త్రాజీ బలవంతముగా నవ్వినాడు. ఈకాపుదల వాక్యములు, అతడు

తరువాత ముసలివానియెడల తలపెట్టిన దౌర్జన్యములో తగినంత జాగ్రత్తగా ప్రవర్తించుటకు పనికివచ్చునని సంతసించినాడు.

"అంతవర కవసర ముండదు. అయినను తగినంత కాపుదలగా ప్రవర్తించుట మంచిదేకదా?" అని ముసలివాని తెలివితేటలకు సంతసించినటుల నటించి "నీవు నన్నీవేషమున నిదివరకు చూడ లేదనుకొందును." అని సగర్వముగా తన ముఖములోని మార్పు చూపినాడు.

జబ్బార్ రంతకన్న గంభీరముగా "సందడకను, నీవాలకమునుబట్టి నిన్ను నేను కొంతకాలమునుండియే గురుతింప గలిగితిని. నీ విక్కడ కిట్టివేష మేసియొ యొకటి వేసికొని వత్తునని నే నిదివరకే యనుకున్నాను. మోహాతా నీ వన్నటులుగనే యిక్కడకు వచ్చినాడు. వానివెంట మరియిరువురెవరో కూడ వచ్చి యీప్రాంతము లన్నియు చూపి, వీనిగతికి వీనిని విడచి వారిత్రోవను వారు పోయినారు. కుర్రవాడు మన కోరిక ప్రకారము సరిగా నొకముసలి నిమురగన్నేరుచెట్టు క్రింద కూర్చుని యూదించుచున్నాడు. కొమ్మక్రింద పడవేసినను అది ఒకటిరెండుదినముల క్రిందటనే పడినటుల కనుపించును. వాడు మన కింతకన్న ననుకూలమైన ప్రదేశమున దొరకడు." అన్నాడు.

హార్తాజీ నిర్మలముగా నుండుటకు పెద్దప్రయత్నము చేయుచు "ఏ— ఏమి —ఆ —అది — మ — మంచిదే. అయిన.. న —న — నది — యి— యి — ప్పుడే —కా — కా — కాని—

చ్చెద — వా — " అని మెక్కుచు నడిగినాడు.

జబారు వ్యవహారజ్ఞానము కలవాని లాగున చాల గంభీరముగా "కనిపెట్టుకొని యుండి అనవసరముగా నాలస్యము చేయుటవలన ప్రయోజన మేమి?" అన్నాడు.

మారకప్రయత్నము సమీపించుచుండుటచే నతడు డగ్గుత్తికతో "అయితే మంచిదే. కాని నేనుకూడ రావలయునని — — — — — "

"ఆ. అప్పుడు నీవుకూడ వెంట నుండుము. ఏమియు చేయ నక్కర లేదు. ఊరక వెంటమాత్రముున్న చాలును. నీవు దూరముగానుండి చూచుచున్న నే నీ కొమ్మతో కావలసిన తమాషా యంతయు చేయుదును." అని యాతడు చేతిన నొక డొంకకు చేరవేసిన నిసింగిన్నెరు బడితె యొకటి చూపి హెచ్చరికగా నవ్వుచు "పనిచేయ వలసివచ్చినప్పుడు మాత్రము ఇట్టిదానితోనే చేయవలయును. నీవు నా వెనుక నుండుము పెద్దమనుష్యునిలాగున. నే నాకొంచెమును చేసివేసెదను. తరువాత మన మిరువురమును మిగతవ్యవహార మంతయు నేర్పాటు చేసికొందము. ఊఁ! రా! మొగమోటపడక" అని నడక సాగించినాడు.

హార్డాజీ యాపాదమస్తకము గజగజ వణకుచు ముసలివాని వెంట పడినాడు. వా రిరువురొకరివెనుక నొకరు నడచుచు బాటవెంట పడి చెట్లు దట్టముగా పెరిగి చాలవరకు మూసికొని పోయినయొక తూములోనుంచి నాచుకట్టి జారుగానున్న

విశాలప్రదేశమున ప్రవేశించినారు. ముసలివాడు చాల మంద స్వరమున "మన మిక నెంతమాత్రమును మాట లాడకూడదు. వాని చెవిని పడిన చిక్కే. నీవు నా వెంట చాల మెల్లగ, జాగ్రత్తగ మాత్రము రావలయును. క్రింద చూచుకొని మరి నడువు. కాలిక్రింద పుడకలు పడి విరిగినచో చప్పుడగును. నేను నా చేయి వెనుక కీలాగున పెట్టినప్పుడు మాత్రము నీవు తక్షణ మాగి, నేను తిరిగి రమ్మనుమని సంజ్ఞ చేయవరకును, ముందున కడుగు వేయ కూడదు. నీవు స్వతంత్రించి యేదియు చేయప్రయత్నించకుము. అడుగులు చూచుకొనిమాత్రము మరి వేయుచుందుము" అని మెల్లగా గుసగుస లాడినాడు.

"ఆలాగే! ఆ! ఆలాగే. తొందరగా నడువుము" అని హార్త్రాజీ ఊపిరి విడచినాడు.

వారు మరియు ముందునకు పోయి యెంతమాత్రమును అనుమానము లేని యామయమాయకుని సమీపించుచున్నారు. వారిప్పుడు ముందున్న కర్రలగుట్ట సమీపించినారు. నిజముగా జబారు హార్త్రాజీ నంతకన్న ముందునకు రావలయునని బలవంతము చేయడు. వానికి ఫిరోజే కంటబడుట తటస్థించెనా, అతడు నిజముగా కంగారుపడి గుట్టు బట్టబయలు చేసికొనుట సిద్ధాంతము. మరియొక యడుగు — మరియొకటి — మరియొకటి — అంతట జబారు చేయి వెనుకకు పోయి, హార్త్రాజీ యికముందునకు రాకుండ నక్కడనే యాగవలయుననిన గురుతుగా నాడినది. రెండవ చేతిలోని పెద్దబడిత ముందు దూ

రము న డొంకలమధ్య తల యెత్తి నిలచియున్న యొకపెద్ద ని ఱారగన్నేరుచెట్టువెపు చూపుచు తలపిసరినది.

హర్తాజీ నిలచినచోటనే కొయ్యవారి పోయినాడు. సమయము సమీపించినదని వానికి బాగుగా తెలియును. ప్రమాదమును గురుతించకుండ నిర్విచారముగ సంచరించు లేడి పిల్లమీదకు దుముకు సింహములాగున ముసలివాడు చాల మెలకువగా ముందునకు జరిగి పోవుచున్నాడు. వానివీపు ముందునకు వంగినది. వానిచేతిలోని బడితె పూర్తిగా మీదకు లేచినది.

అతడు, పెడలాగున చాల నిశ్శబ్దముగా ముందువరస పొదలలో దూరి, చంగున ముందునకు దుమికినప్పుడు వాని కన్నురాకుండుటకై, చిన్నచెట్లకొమ్మలు నిశ్శబ్దముగా ప్రక్కకు తొలగించినాడు.

ఇప్పుడతడా చెట్టుప్రక్క నున్నాడు. మెల్లగా చెట్టు చుట్టి వచ్చుచున్నాడు. అదిగో! ఇక కనుపించుట లేదు ఇప్పుడు — — — —

ఒక బలమైన 'దబ్బ' మను శబ్దముతో నాయు డవి యంతయు మారు మ్రోగినది. హాయోరు మనిన కేక. యొకటి దానిని వెంబడించినది. వెంటనే దబేలుమను చప్పుడు మరియొకసారి వినుపించినది— అంతయు నిశ్శబ్దము. హర్తాజీ యామనోవేదన నిక భరియించజాలక పోయినాడు. పొడియారి పోయిన వానిపెదవుల సందునుండి మందమైన కీచురావ మొకటి యప్రయత్నముగా బయలుదేరినది.

త్రోవలోని చిన్నమొక్కలు చిక్కద్రాక్ష విరుగగొట్టుచు కంగారుగా మూసనకు పరుగెత్తి వచ్చి హాడిలిపోయి నివ్వెరపడి నిలుచున్నాడు.

జబారు నేలమీద నిలువున సాచుకొని పడియున్న మొహాతాషిరోజు కళేబరమును మూసనకు వంగి చూచుచున్నాడు. వాని మొగము యింకను ముసుగులో మాటుపడియున్నది. మురికితో నిండిన రక్కమారిన వాని చెక్కిళ్ళమీద దిగ్విజయము సాధించిన పసన్నిమాత్రము స్పష్టముగా నున్నాని నాసముల సందడి వెలుగుల పడుచున్నది.

అతడు చాల కూరస్వరమున "అదిగో చూడు. నీవు చెప్పినటుల పనంతయు సంతృప్తికరముగా చేసినానుకదా! ఏమి?'' అని ప్రశ్నించినాడు.

హార్తాజీ తొట్రుపాటుతో "ఆ — అవును. చే — చేసితివి, నీవు — అతడు — — — — అతడు — చనిపోయి — నాడా? '' అని మాట రాకరాక యడిగినాడు.

జబారు చాల తీవ్రముగా "అది నిర్ధారణ చేసికొనుటకేకదా దెబ్బమీద దెబ్బ కొట్టవలసి వచ్చినది. ఈ రాత్రి వానికి నిదుర పట్టుట కెవరును జోలపాడ వలసిన యవసరముండదు. వీని నీయవస్థకు తెచ్చినందులకు నీవు నా కిచ్చెదనని వాగ్దానము చేసినడబ్బు యెప్పు డిచ్చెదవు? అది చెప్పుముందు?" అని యడిగినాడు కచ్చితముగా.

హార్తాజీ దడగా "నాకు మా ముసలాయన యాస్తి

సంక్రమించువరకును నీ కేమియు నీయజాల నని నేను మొదటనే చెప్పితినికదా!" అన్నాడు.

"ఆ! అంతవర కాగిన చాల యాలస్య మగును" అని జబారు కులాసగా సమాధానము చెప్పి నిలువున సాగి నిలచి ముసుగు తొలగించి ముఖముమీద చేతితో గట్టిగా తుడిచికొని కృత్రిమపువేసము తొలగించినాడు. మరుక్షణముననే రామసింగు స్వరూప మక్కడ వికారముగా నవ్వుచు నిలచినది!

హర్నాజీ మతిపోయినవానిలాగున గ్రుడ్లు తెరచుకొని నివ్వెరపడి చూచి వెనుకకు తిరిగినాడు పారిపోవుటకు. కాని అంతలో మరియొక వ్యక్తి నిశ్శబ్దముగను ఆకస్మికముగను చెట్టువెనుకనుండి తిరిగి వచ్చి వాని కెదురైనది.

తుకారాము పిస్తోలు వానివైపు గురిపట్టి యుంచి "ఆ! ఆవేషము లిచ్చట సాగవు. నీ వింకను దొంగవేషములు వేయ ప్రయత్నించితివా నాపిస్తోలులోని గుండు నీమోకాటి చిప్పలో మకాము చేయగలదు. అందులోని గాయము చాల ప్రమాదకర మైనది. జీవితకాలమంతయు కుంటవలసిన యోగ్యత కలుగు చేసికొనకుము. జాగ్రత్త!" అని మందలించినాడు.

హర్నాజీ కంగారుపడుచు పెద్దగొంతుకతో "నేను — మేము — వేళాకోళము — అంతే. మొదటినుంచి — —" అని యొక్కగా "ఓ— — — — —" అన్నాడు కెవ్వు మని.

అతడు, అప్పుడే సరుదుకొని లేచి, కడుపు చెక్కలగు నటుల వికారముగా నవ్వుచున్న ఫిరోజువైపు చూపినాడు

అంతలో మరియొకవ్యక్తి వచ్చుట ప్రవేశించి కార్యక్రమము నుపూర్తి చేసినది. ఫిరోజు ముఖలక్షణములు బిగిసిపోయినవి. వానియానందము కంగారులో పడినది. వానిదృష్టి తుకారాము వెంట రుసరుస లాడుచు ప్రవేశించిన పెద్దతండ్రి రత్నాజీని వెర్రికేక వేసి గ్రుడ్లు తెరచుకొని కంగారుగా చూచుచున్న హర్తాజీవైపు పోయినది. హర్తాజీ కొయ్యవారి దబేలున క్రింద పడినాడు. స్మృతి పోయినది.

గడగడ వణకుచు చేయి చాపి చూపుచు "అతడు — నేను — అత డేమయిన — — — — — " అని నోట మాట రాకరాక అన్నాడు ఫిరోజు.

"నీ వంతవరకును సందేహించుట సబబే. అతడు జీవించియున్నవాడేగాని నీవనుకొన్నటుల దయ్యమై రాలేదు. నిన్ను కంగారు పరచవలసి వచ్చినందులకు నాకు చాల విచారముగా నున్నది. కాని యీతుంటరిసన్యాసికి తగిన ప్రాయశ్చిత్తము కావలసినదే. ఆహా! అవును. అది ప్రశస్తమైన పనే" అని రామసింగన్నాడు.

ఫిరోజు క్రిందనుండి చంగున లేచి ముందునకు గెంతి పెదతండ్రిచేయి చాల యాప్యాయముగా పట్టుకొని కన్నుల కద్దుకొని "అయ్యా! మిమ్ములను చూచుటకు నాకు చాలా ఆనందముగా నున్నది. మీరు స్వర్గస్థులయిరని చెప్పిరిగాని నా కంతవరకును నమ్మకము చాలినదికాదు. మీరు జీవించియుండి ననే మంచిదికదా నాకు. కష్ట మయినను కాలవ్యవధి యయి

నను మీ యాజ్ఞోల్లంఘున నా కెంతమాత్ర మిష్టము లేకపో యినది. కాని మీ యభిప్రాయమునకు వ్యతిరేకము కానిపక్ష మున నాకు కొంచెము ఉప్పును, కొన్ని సిగరెట్లును మాత్ర మిచ్చునటుల మీపీలులోని మూడవషరతు సవరణ చేసిన బాగుండునని నాకోరిక. ఆమార్పుతో నే నీమూడువారములు కావలసినంత కచ్చితమైన కొంచవాసముగాగున కాలక్షేపణ చే యగలను.” అని ఫిరోజు మనసు వెల్లడించుచినాడు.

ముసలివర్తకుడు రత్నాజీ కొంచెము చణకుడు మంద హాసము చేసి 'అబ్బాయి! ఆషరతు ని న్నికనెంతమాత్ర మును బాధించకుండ చేయుచును లే. ఇప్పు చాల యసంతుష్టి కరమైన సంగతులు నాకుకూడ యనుభవమునకు వచ్చినవి. వాటిసంగతి తరువాత వ్యక్తపరచెదను. ఈలోపున - — —

అంతలో రామసింగప్పుడే కదలుచున్న హర్తాజీవై పు చూపుచు “మన మీలోపున నీప్రియకుమారుని వ్యవహా రము చక్కబెట్టుట మంచిది.” అన్నాడు.

తుకారాము సంగతి గ్రహించి చేరువనున్న చెరువుద గ్గరకు పరుగెత్తి కొంచెమునీరు తీసికొని వచ్చి, హర్తాజీముఖ మున పోసి వానికృత్రిమపువేష మూడపీకినాడు. హర్తాజీ నె మ్మదిగా కదల ప్రారంభించినాడు. వానిదృష్టి ఫిరోజువైపు ప్రసరించినది. “నీ వింతకు పూర్వము చచ్చిపోతివికాదా?” అ ని యొక వెర్రికేక వేసి, “నిన్ను జబారు కొట్టిచంపినాడు. నే నాదెబ్బలు స్పష్టముగా విన్నాను. కాని - అతడు — జబారు కాదు — అతడు — - - - ” అని మాటరాక గడగడ వణ

కుచు ముఖము రెండుచేతులతోను కప్పుకొని "నాకు మతిపో యినటుల కనుపించుచున్నది" అని వెక్కి-వెక్కి- యేడ్చినాడు.

రామసింగు స్పష్టముగా కావలసినంత కచ్చితముగా "కాదు బాబు! జబారు కాదు. నిన్నరాత్రి నీకును, జబారున కును జరిగిన సిగ్గుమాలిన సంభాషణ, ఒడంబడిక నేను స్పష్ట ముగా విన్నాను. అత డీక్షణమున కాళ్లు చేతులు కట్లతో, నోటకుక్కిన గుడ్డతో వానిమంచము క్రింద నీకొరకు కనిపె ట్టుకొని యుండును. నేను వానికి బదులుగా బయలుదేరినాను నీయెదుటనుండి చెట్టుప్రక్కకు తప్పుకొని పెద్దయర పొకటి యరచి, క్రిందపడుమని ఫిరోజునకు చెప్పి, వానిప్రక్కను నే లమీద రెండుదెబ్బలు కొట్టి నాటక మంతయు స్వభావసిద్ధము గా నుండునటుల చేసినాను. అంతవర కాడొంకచాటున దా గొని సంగతంతయు శ్రద్ధగా కనిపెట్టి చూచుచుండిన మీాముస లాయనకు నీయపరాధమును నీవే వెల్లడిపరచుకొన్నావు. అం దుచేత నీ విక మారుమాట చెప్పక నీజ్ఞాతి కాళ్ళమీాద పడి తప్పు ఒప్పుకొని చెంపలువాయించుకొని క్షమించు మని ప్రా ర్థించుము. అదియె మా హృదయపూర్వకమైన సలహా తెలిసి నదా?" అని మందలించినాడు.

"ఆహా! నాసంబంధ మున్నంతవరకును వానిప్రార్థన మక్కరలేకనే వానిని నామనఃపూర్వకముగా క్షమించుచున్నా ను" అన్నాడు ఫిరోజు.

"ఒక్క- షరతుమీాద. అత డీనిమిషము నీదేశము విడి చి పోవవలయును"

"అయ్యో! నేను కేవలము దరిద్రుడను. సమ్మిడియైన లేనివాడను. ఒక డింతవరకును సన్ను జలగలాగున పీల్చి పిప్పిచేసి — — — —" అను నంతలో ముసలిసర్దారుడు ముందునకు వచ్చి "ఇవిగో! అయిదువేలరూపాయి లకు నోట్లు. ఇవి తీసికొని దేశము విడచి సాధ్యమయినంత దూరముగా పొమ్ము. వీలుగలిగిన, బుద్ధికలిగి నీప్రవర్తన బాగుచేసి కొనుటకు ప్రయత్నించుము అని నోట్లిచ్చినాడు.

హార్నాక్ పొ మ్మందుకొని, చుట్టును వెర్రిచూ పొకటి చూచి సత్తువలేని కాళ్ళీడ్చుకొనుచు దూరమున చెట్లచాటున మాయమైనాడు.

## 33

సేట్‌రత్నాజీ తీరుబడిగా నవ్వుచున్న రామసింగువైపు సిగ్గుపడుచు చూచి, క్షమాపణపూర్వకముగా దగ్గుచు "నేను చేసినది చాలపొరపాటుపని యని రామసింగుగా రనుచున్నారు. నాకును ఆలాగుననే బోధపడినది. కాని, అబ్బాయి! నిన్ను పరిశీలన చేయుట కిది ప్రారంభమున చాల ప్రశస్తమయిన పద్ధతిలాగుననే కనుపించినది. నీ వనిన నా కభిమాన మెక్కువేకాని నమ్మకముమాత్రము చాల తక్కువ. నీ స్థిరత యెప్పటికిని కుదురుసటుల కనుపించినదికాదు. అందుచేత నలుగురు నేను యాకస్మికముగా ప్రమాదవశమున మరణించితినని

నమ్మకములు చేయవలసివచ్చినది. నేను మొదటినుండియు చాల బుద్ధిమంతుడని యభిప్రాయపడియున్న హర్షాజీవాటివాడింతటి దుర్మార్గుడగుననియును ఇంతటి నీచముగా ప్రవర్తించి మన కన్నికష్టములు తెచ్చిపెట్టుననియును నా కావంతయైన నను మానము కలిగినదికాదు!"

ఫిరోజు రామసింగువైపు తిరిగి "ఇది మీకుకూడ తెలియునా యేమి?" అన్నాడు.

"ఆ! కాని ప్రారంభమున నా వకీలు పరశురామప ఠీలుపకు తప్ప యితరు లెవరికిని తెలియు నవకాశము లేని వివిధ ములోన్ని సంగతులు కొనిపత్రికలలో కనుపించినవి. రహస్యముగా నుండవలసిన యీసంగతులు పరశురామపఠీలు గొంతుక కోసినను పత్రికలలో ప్రచురపరచడుకదా! అందుచేత పత్రిక చూడగనే నాకు కొంచెము సందేహమున కవకాశము కలిగినది. మీపెదనాయనగారి కళేబర మక్కడ నీటివారను కనుపించలేదనిసంగతి విపరీతముగ కనుపించి కొంతయనుమానము కలిగినది. అందుచేత నేను ప్రమాదము సంభవించినదని చెప్పుకొనినచోటకు పోయి చాలరహస్యముగా ప్రవర్తించి చుట్టు ప్రక్కల వాకబుచేసినాను. రత్నాజీని ముంచివేసి వానికళేబరమును సముద్రమున కీడ్చుకొనిపోయునదని యభిప్రాయపడుట కాధారమైన యాసముద్రపుపోటు, వాని కాకస్మికమరణము తెచ్చిపెట్టినదనుకొనిన యాదిక్కుమాలిన స్నానమున కతడు పోయిన తరువాత నొకగంటవరకుగాని రా లేదని నేను సహేతుకముగా ఋజువు పరచుకొన్నాను. గట్లు యెగువున, దిగువున

చాలసేపు వెతకినాను. చివరకు, అప్పటికప్పుడే చాలవరకు చెదిరిపోయి యస్పష్టముగా నున్నవానిజాడలు దొరకినవి. ఎంత యస్పష్టముగానున్నను నన్నిప్రదేశమునకు తీసికొని రాగలిగినంత స్పష్టముగా మాత్ర మున్నవి. అత డీయింట ప్రవేశించినటుల స్పష్టపరచినవి. ఇక్కడ కాపున్నజబారు వానిమామూలుపద్ధతిగా గాక మంచిప్రశస్తమయిన విలువగల తినుబండారములు కొనుచున్నటుల వాకబుమీద తెలిసికొన్నాను. చిట్టచివరకు రత్నాజీ, యింటివెనుకవైపున పరిశ్రామార్థము పచారుచేయుచుండుట నేను కనులార చూచినాను. పత్రికావ్యాస మెవరు పంపినారో, నాకాక్షణముననే స్ఫురించి నది.''

రత్నాజీ వెర్రినవ్వు నవ్వుచు "అది ఫిరోజునకు కొంచెముద్రేకము కలుగచేయు ననుకున్నాను" అన్నాడు.

"నా కందు స్ఫురించిన యసంసవ్యత నే నప్పుడే వ్యక్తపరచి యుందును. కాని వీలులోనిషరతులు నెరవేరకుండ చేయుటకు నాపూర్వప్రతికక్షియైన డాక్టరుకర్ణాబర్వే యప్పటికప్పుడే రెండవపక్ష మవలంబించినాడని నాకు తెలియవచ్చినది. చివర మే మిక్కడకు వచ్చినప్పుడే ఈప్రహసనమునకు మంగళము పాడ నిశ్చయపరచుకున్నాను. డాక్టరుబర్వే సిగ్గుపడి వ్యాపారమునకు సన్యసించి పోయినతరువాత హర్తాజీయే స్వయముగా కార్యభారము వహించుటచే యిదంతయు నీవిధముగా పరిసమాప్తినొందునని నే నభిప్రాయపడి రత్నాజీగారిని కలిసికొని సంగతిసందర్భములు మాటలాడుటకై రాత్రి ఎనిమిదిగంటలకు వానిదగ్గరకు పోయినాను.

నేను జబారును కనిపట్టి యతడు వానియజమానుని కి భోజనము సిద్ధముచేయునని నిరీక్షించియున్నాను. అతడా లాగునచేయుటకు మారుగా వ. వేలరూపాయీల కిమ్మత్తుగల నోట్లు తెచ్చి యానందించసాగినాడు. ఆహా! నవుకరుమూండకొడుకు యజమానుని హత మార్చియుండునని కంగారుపడి వానిని చీవాట్లు పెట్టుటకు ముందుకు పోదలచుకొనునంతలో హర్త్రాజీ యక్కడకు వచ్చి ఫిరోజును హతమార్చుటకు వేరము స్థిరపరచుకొన్నాడు.

హర్త్రాజీ వెడలిపోయిన తరువాత నే నాయింట ప్రవేశించి చప్పుడు చేయకుండ, నోట ధ్వనియైన రాకుండ జబారును స్వాధీనపరచుకొని, కట్టిపెట్టి, యతడు కథయంతయు సప్రమాణముగా సంగీకరించునటుల చేసినాను. యజమానునిదగ్గర యపరిమితమైన ధన మున్నదని యప్పటికి వారమురోజుల క్రిందటనే కనిపెట్టిన యాతుంటరిముండకొడుకు, ఆకస్మికముగా వానిపై బడి కాళ్ళుచేతులు కట్టివేసి మీదివరుస గదులలో నొకదానిలో బంధించి దేశము విడచి మోల్మేను పారిపోవుటకు యేర్పాటులు పూర్తి చేసికొన్నాడు. హర్త్రాజీ యమభటునిలాగున వచ్చి వాని కాస గొలిపి యడ్డురాకపోయిన పక్షమున వా డీసరి కెయిరిపోయి మార్గమధ్యమున నుండియుండును. నాకు దొరకకనే పోయియుండును. కథ వేరుతోవ పట్టియుండును.

నేను తక్షణము పోయి, రత్నాజీగారి కట్లు విప్పి, హర్త్రాజీగారి దౌర్జన్యమును క్రౌర్యమును వానినోటినుండియే వినునటులచేయుటకై వీరి నిక్కడకు తీసికొనివచ్చినాను.

"ఈమధ్యాహ్నము నే నిచ్చటకు వచ్చి, జబారులాగున వేషము తయారుచేసికొని వాని కుళ్ళు గుడ్డలుకూడ ధరించినాను. మీగతసంగతి మీకందరకును తెలిసినదే. సరే. కాని — — — రత్నాజీగారూ! మన మిప్పుడు జబారుసంగతేమి చేయవలసియున్నది?" అని యడిగినాడు.

రత్నాజీ తొందరగా "పోనిమ్ము! పోనిమ్ము! వానిని స్వేచ్ఛగా పోనిమ్ము వానికి కొంతడబ్బు నిచ్చి పంపివేయుదము. అదియె మంచిపద్ధతి. లేనియెడల వానివిచారణసమయమున హర్షాజీ కథయంతయు వెల్లడియగును. ఏలాగయినను, అతడు నాసోదరకుమారుడేకదా! అదిమాత్రము నాకు కాదా! జబారు నావలకు గంటివేయుడు. స్వలాభము కోరినయెడల నోరు మూసికొని యూరకుండును." అని చాలకష్టముగా వ్యక్తపరచినాడు.

"మన మిదివరకే యొకదౌర్జన్యమును మాటుపరచి న్యాయశాస్త్రము కంట కారము కొట్టినాము. రెండవదికూడ చేయుటలో దోషము లేదు." అని రామసింగంగీకరించుచు నవ్వి "ఫిరోజు! నీవు తుకారామువెంట మాయింటికి వెళ్ళుము ప్రస్తుతము. నేను రత్నాజీగారితో యొంటరిగా కొంత ముచ్చటించవలసి యున్నది." అన్నాడు. ఆయిరువు రచ్చటనుండి తగినంతదూరము పోయినతరువాత రామసింగు ప్రసంగము తి

దిగి యందుకొని "అయ్యా! నేను మీకు చెప్పతగినవాడను కానుకాని, అయినను మీరు చేసినది చాల చిన్నతనపుపని యని చెప్పవలసి వచ్చినందులకు నాకు చాలవిచారముగా నున్నది. క్షమించ ప్రార్థించుచున్నాను. మీమతిమాలినప్రవర్త న మీకురత్నవాని నొకనిని యొకసారికాదు. అధమము అరడ జనుసారులకు తక్కువకాకుండ ప్రాణాపాయకరమైన స్థితిలో నికి తెచ్చినది. అదియె రెండవవాడు బుద్ధిపూర్వకముగా హం తకుడగునటుల చేసినది. అందుచేత మీరు దానికి పరిహారార్థ ముగా నా చిన్నవానిని మెహతాఫిరోజును మీయావదాస్తికిని ఉత్తరాధికారిగా నియమించి ఆదరపూర్వకముగా చూచుచుం డవలయునని నాకోరిక. అదికాక" అని క్షమ మాగి పాడుపడి న యాయింటివైపు చేయి చాపి చూపి "అతడు సరియైన య ధికారి యగువరకును వాని నీప్రదేశమున సపరివారముగా ని లిపి యిపన్నియు సరియైన స్థితిలో నుండునటుల చేయుడు. అ తడు సత్ప్రవర్తనుడును, సమర్థుడును. నామాట విని నేనుచె ప్పినటుల చేయుడు. దానిలోని మంచిచెడ్డలు ముందుముందు మీకే బోధపడగలవు ? అన్నాడు.

ముసలిరత్నాజీ వానిప్రవర్తనలోని పొరపాటు పూర్తి గా బోధపడినందున సిగ్గుపడి రామసింగుతో నమ్రతగా చి

త్తము తమసలహాకు వందనములు. నేను తప్పకాలాగునన్నే చేయుదును అన్నాడు.

అతడు తరువాత సాధ్యమయినంత త్వరలో నంతవరకు చేయుటయేగాక సర్దారు మాణిక్యలాలుతో వియ్య మందుట కూడ జరిగినది.

స ం పూ ర్ణ ము.

---



---

శ్రీ సీతారామాంజనేయప్రెస్, రాజమండ్రి